JAGATI Rs. 2-00 Sept. 1985

30th Year of Publication



## స్వాతంత్ర్య దినోత్సవ సంచిక



'చదరంగం'

'సోవియట్ భూమి' సౌజన్యంతో

'జగతి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు-600 004
ఫోన్ : 76697 – సం॥ చందా రు. 20–00. 2 సం॥లకు రు. 38–00 5 సం॥లకు రు. 85–00. జీవితచందా రు. 300–00... విదేశాలకు 2 సం॥లకు రు. 85–00

ముఖచిత్రం: డా॥ పట్టాభి





మానసిక వ్యాధులు కుదర్చడంలో పేరుబడ్డ మాధవరావు తన పేషంటుని అడిగాడు: 'ఎలా వుందయ్యా నీ మతిమరుపు?'

'కొంచెం మెరుగైంది, సార్. ఇంతకుముందు ఎవరింటికైనా వెళ్ళినప్పుడు రెండు చెప్పులూ మర్చిపోయే వాడిని. ఇప్పుడు ఒక చెప్పు మాత్రమే మర్చిపోతున్నాను ....'

—యస్ రామకోటేశ్వరరావు

వినుకొండ

నీకు హెల్మెట్ కావాలా? మోటారు సైకిలు లేదుకదా, మరినీకెందుకు?- అని ప్రశ్నించాడు రాజశేఖరం, సుబ్బారావుని.

'మా ఆవిడ నవ్వుతూ వేసే మొట్టికాయలకి యిది రక్షణగా ఉంటుందని!' — అన్నాడు సుబ్బారావు.

—అర్ నాగేశ్వరరావు

మాచర్ల

ఇదుగోనండీ, ఈ వస్తువు తీసుకోండి- అన్నాడు ఆనందరావు, షాపతనితో.

'అదేమి కుదరదండీ - ఒకసారి ఇంటికి తీసుకెళ్లిన వస్తువు మళ్లీ వెనక్కి తీసుకోమండి'

'అయితే సరెండి - ఇందాక కొన్న వస్తువులతో, యిది అదనంగా పాక్ చేశారు పొరబాటున!'

తెల్లమొహం వేయడం షాపతని వంతయింది.

—ఎమ్ వరప్రసాదరావు

ఇబ్రహీమ్‌పట్నం

ప్రతిభానరావు ఒక సబ్బుల కంపెనీకి ఇలా రాశాడు: "మీ కంపెనీ [illegible] సబ్బుని నేను అనేక [illegible] వాడుతున్నాను. మీ సబ్బు నాకెంతో సంతోషాన్ని, ఆరోగ్యాన్ని యిస్తున్నది."

ఆ సబ్బుల కంపెనీ మేనేజరుగారు యిలా జవాబిచ్చారు: "అయ్యా – మీ అభిమానానికి కృతజ్ఞులము. మీరు పేర్కొన్న ఆ సబ్బు, కుక్కల కోసమని తయారు చేశాము. అది మీకు నచ్చినందుకు, వాడుతున్నందుకు హృదయపూర్వక నమోవాకములు."

—యన్ లక్ష్మి

మద్రాసు-24

నీదగ్గిర ఇరవై వుందనుకో - నాకు పది అప్పిచ్చావనుకో - యింకా ఎంత మిగులుతుంది? - అని నిరంజనరావు ప్రశ్న.

'ఇరవై' అన్నాడు నిత్యానందం.

'ఇరవైలో పదిపోతే, యిరవై వుండట మేమిటి?'

'పోవుగా - నేనెవరికీ అప్పివ్వనుగా!' - అన్నాడు నిత్యానందం.

—కె రామకృష్ణ
రేపల్లె

కాళ్లకీ చేతులకీ బాండేజీలతో వినయంగా ఎదుట నిలబడ్డ వెంకటేశాన్ని ఘట్టిగా అడుగుతున్నాడు ఆఫీసరుగారు: "మూడు రోజులు సెలవు పెట్టి ఎక్కడచచ్చావయ్యా-ఆ ఫైల్సన్నీ ఎప్పుడు క్లియర్ చేస్తావు?"

'సార్, నాలుగురోజుల క్రితం అయిదో అంతస్థునుంచి జారిపడ్డానండి"

"ఈ పిచ్చి కబుర్లు నాకు చెప్పకు-అయిదో అంతస్థు నుంచి జారిపడేందుకు మూడురోజులు కావల్సొచ్చిందా?"

—ఎ యస్ రమేష్
బెంగుళూరు-82

అదేమిటండీ, పక్కింటి సుబ్బలక్ష్మి తన మొగుణ్ణి అలా కొడుతూవుంటే ఆయన మీ ఫ్రెండ్ కదా, వెళ్లి విడిపించనైనా విడిపించలేదు? - అన్నది భార్యామణి శ్రీవారితో.

"విడిపించాలనే మనసు తహతహలాడింది, కాని నువ్వు సుబ్బలక్ష్మికి సపోర్టుగా నిలబడితే, నా పనేంగాను?"

—యస్ ఉమామహేశ్వరరావు
గెడ్డలుప్పి

నీకో నిప్పులాంటి నిజం చెప్పనా?- అన్నాడు మూర్తి, తన భార్యతో.

'కాస్త ఆగండి - మీ వెనకనే కిరోసినాయిల్ డబ్బా వుంది -'

—కె గోపాల్‌రావు
విజయవాడ-4

# పాఠకుల తీర్పు

చందూర్‌గారికి : వందనములు. 'జగతి'లో అందరికీ తగిన వేర్వేరు అంశాలు వుంటున్నవి. జోక్సునుంచి పసిడి పలుకులు దాకా పద్నాలుగు అయిటమ్స్ చాలా విలువగలవి. కె ఆర్ విజయను కలుసుకున్నప్పుడు వ్రాసినది చాలా బావుంది.

—ఎ శ్రీనివాసులు
హొసూరు

డియర్ చందూర్‌గార్కి నమస్కారములు. నిమ్మతొనలు పుల్లపుల్లగా తియ్యతియ్యగా ఉంటున్నవి. అన్న పూర్ణారెడ్డిగారి 'ఆనంది' సీరియల్ ఎంతో ఆసక్తిదాయకంగా ఉంటున్నది. అన్ని శీర్షికలు మాకు బాగుంటున్నవి.

—యస్వి రఘు
నగరి

మిత్రమా : మీ 'డైరీ'లో నేబుల్ గోష్ఠి వివరాలు! అయితే ఢిల్లీ వచ్చి మమ్మల్ని 'హలో' అనకుండానే వెళ్లారన్నమాట - అన్యాయం! గోష్ఠి జరిగిన రోజుల్లో దూరదర్శన్ పనులు మిక్కిలిగా వుండటం వల్ల రాలేకపోయాను - ప్రస్తుతం టివి నేషనల్ న్యూస్‌లో వున్నాను - మీకు తెలిసే వుంటుంది. అచంట జానకిరామ్‌గారు ఎక్కడ ఉన్నారో మీకేమైనా ఎరికా? మిత్రులు డి ఆంజనేయులుగారు కలిస్తే నమస్కారం చెప్పండి. మీ ఉభయుల క్షేమ సమాచారం, సాహిత్య వ్యాసంగం వివరాలు వ్రాయగలరు

—వి పతంజలి
న్యూఢిల్లీ-27

సంపాదకులకు : 'జగతి' ప్రతి నెలా నా స్నేహితుని వద్దనుంచి తీసుకు చదువుతాను. నాకు స్వంతంగా తెప్పించుకు జాగ్రత్త చేయాలని వుంది. కొన్ని శీర్షికలు అతి విలువైనవి.

....ఎ నరేష్ కుమార్
మెదక్

'జగతి' ఎడిటర్ చందూర్‌గార్కి నా హృదయ పూర్వక నమస్కారములు. మాకు తెలియని విషయాలెన్నో తెలియబరుస్తున్నారు. మాస పత్రికలలో 'జగతి' మాణిక్యంలాటిది. ఒకసారి చదివినవారు వదిలిపెట్టరు - ప్రతినెలా చదువుతారు; చదవాలని పిస్తుంది. లైబ్రరీలో అది టేబిల్ మీద ఎప్పుడూ వుండదు - ఒకరి చేతిలో నుంచి మరొకరి చేతిలోకి పాకిపోతూ వుంటుంది. సైజు పెద్దది చేశారు - పేజీల సంఖ్య పెంచమని మా కోరిక.

—కె నారాయణరావు
ఎవి పాలెం

# ప్రాచీన సాహితి

జననము బావుచేత శమసౌఖ్యము కాంతల లీలచేత జ
వ్వనము జరార్తి చేత గుణవర్గము కూళలచేత రాజు దు
ర్జనములచే ముదంబు ధనరాగముచే సిరులెల్ల లేమిచే
వినిహతి జెందె దోష పరి విద్ధముగాదె తలంప నెద్దియున్

-భర్తృహరి

పాంచ భౌతికము దుర్బల మైన యీ కాయ
మెప్పుడో విడుచుట యెఱుక లేదు
శత వర్షముల దాక మితము జెప్పిరిగాని
నమ్మరా దామాట నెమ్మనమున
బాల్యమందో మంచిప్రాయమందో లేక
ముదిమి యందో లేక ముసలియందో
యూరనో యడవినో యుదక మధ్యముననో
యెప్పుడో విడుచుట యేక్షణంబొ
మరణమే నిశ్చయము బుద్ధిమంతు డైన
దేహమున్నంతలో మిమ్ము దెలియవలయు
భూషణ వికాస శ్రీధర్మ పురనివాస
దుషసంహార నరసింహ దురితదూర

—నరసింహాశతకం

మదమాతంగ తురంగ కాంచన లసన్మాణిక్య గాణిక్య సం
పద లోలిం గొనివచ్చి యిచ్చి ముదమొప్పం గాంచి సేవించి ర
య్యుదయాస్తాచల సేతు శీతనగ మధ్యోర్వీపతు ల్పంతతా
భ్యుదయున్ ధర్మజు దత్యభాస్థితు జగత్పూర్ణ ప్రతాపోదాయున్

—నన్నయ 'భారతం'

## ఇది విన్నారా?

1947 ఆగష్టు 15వ తేదీ నాటికి అంటే దేశానికి స్వాతంత్ర్యం వచ్చినపుడు 22, 116 తపాలా కార్యాలయాలు ఉండేవి.

1984 సెప్టెంబరు 30 నాటికి దేశంలో తపాలా కార్యాలయాల సంఖ్య 1,44,772 కు పెరిగింది. ఇందులో 1,29,490 గ్రామ ప్రాంతాలలోనూ, 15,282 పట్టణ ప్రాంతాలలోనూ ఉన్నాయి.

గ్రామీణులు తపాలా కార్యాలయానికి 3 కిలోమీటర్లకు మించిన దూరం వెళ్లనవసరం లేని విధంగా గ్రామీణ తపాలా కార్యాలయాలు ఏర్పాటయ్యాయి. వెనుకబడిన ప్రాంతాలకూ, గిరిజన ప్రాంతాలకూ వీటి ఏర్పాటులో ప్రాధాన్యత నిచ్చారు.

ప్రజల్లో పొదుపు చేసే అలవాటు పెంపొందించే వుద్దేశ్యంతో ప్రతీ పోస్టాఫీసులోనూ సేవింగ్స్ బ్యాంకు సౌకర్యం కల్పించారు. దేశంలో తపాలా సేవింగ్స్ బ్యాంకులు అత్యధిక సంఖ్యలో వున్నాయి. దేశంలో ఉన్న మొత్తం 5 లక్షల పోస్టుబాక్సుల్లో నాలుగు లక్షలకు పైగా గ్రామాలలో వున్నాయి.

దేశం వివిధ ప్రాంతాల ప్రజల మధ్య వారధిగా వున్న తంతి, తపాలా, జాతీయ సమైక్యతకు ఒక పటిష్టమైన సాధనంగా విస్తరించింది.

## సినీ చిత్రపోటీ

1985 జూన్ నెల. ఆ బొమ్మలోని వారు 'సీతారాములు 'చిత్రంలోని కృష్ణంరాజు, జయప్రద అని, పోటీలో పాల్గొన్నవారిలో 82 శాతం పోల్చుకో గలిగారు. బహుమతి పొందినవారు: పి వెంకట చలపతి, కేరాఫ్: పి. హర నాథ్ 6/4/1 - 10/1 సూరప్ప వీధి, సంత పేట, చిత్తూరు... టియన్వి యస్ ప్రసాద్, కేరాఫ్: తాళ్ల నారాయణ, రాజాఫోటో స్టుడియో కెదురుగా మెయిన్ రోడ్, రామచంద్రాపురం - 533255 - తూర్పు గోదావరి జిల్లా ......మొదటి ఇరవై: 1 జి భాస్కరావు, గోపాలపట్నం 2 బి గంగాధర రావు, రాజమండ్రి 3 సి మోహన్, విజయవాడ 4 సి రమాదేవి, సికింద్రాబాదు 5 కె మోహన్, హైదరాబాదు 6 షేక్ అముల్లా, మంగళగిరి 7 కె జానకీదేవి, కాకినాడ 8 జి రాజేశ్వరీ దేవి, ఉండి 9 పి పద్మనాభన్, తలుపూరు 10 జి సంజీవకుమార్, హైదరాబాదు 11 ఎమ్ సాయి బాబా, ఎడ్లపల్లి 12 ఎ షరీఫ్, కశింకోట 13 యన్ గౌరీశంకర్, తాళ్లపాలెం 14 జి అప్పారావు, కోటవురాట్ల 15 కె శేఖర్, నగరి 16 టి విఠల్‌రావు, విజయవాడ 17 పి నరసింహారావు, తిరుపూరు 18 జె శ్యామల, అనంతపురం 19 పి ఛాయాదేవి, మైసూరు 20 ఎ శేషు, మర్రిపాలెం. విజేతలందరికీ అభినందనలు.

## వెన్నెల కెరటాలు

పశువులకు తప్ప మానవమాత్రు లకు గడ్డి లభించకుండా చేయాలనే ఉద్యమానికి ప్రజాశక్తిని సమీక రించడం ముమ్మాటికీ మెచ్చుకోదగిన విషయం. తప్పు చేసినవారిని శిక్షిం చడం అవినీతి నిర్మూలనకు ఒక పద్ధతి. ఇది ఫలప్రదమైతే, ప్రభుత్వానికి జరిమానాలు, ఎగవేసిన పన్నులు, దోచినఆస్తులు మొదలైన వాటి ద్వారా అదనపు ఆదాయం లభించవచ్చు. అవి నీతి అనేది ఒక మాయాపదార్థం. ఏసమ యంలోనైనా అవినీతి ఇన్ని టన్నులు పెరిగిందని కాని, ఇన్నిటన్నులు తగ్గిం దని కాని అంచనావేసి చెప్పడం కష్టం. అయినప్పటికీ, వక్రమార్గావలంబకులు సర్వత్రా ఉన్నట్టు చూచాయగా తెలు స్తూనే ఉన్నది. ఈ బెడదను కేవలం శిక్షాపూర్వక చర్యలద్వారా ముట్టించడం సాధ్యమా? ఒక పవిత్ర మైన వాతావరణాన్ని కల్పిస్తే తప్ప అవినీతి, అక్రమాలు నశించవు. అట్టి వాతావరణం ఏర్పడాలంటే అత్యు న్నత స్థానాలను అలంకరించే ప్రము ఖులు అన్నిటా ప్రజలకు ఆదర్శ ప్రాయులుగా ఉండాలి.

—సంపాదకీయం

'కోస్తావాణి'

### 'అతడు ఆమె'

1920-35 మధ్య ఖాదీ ఉద్య మానికి అండదండలందించిన ముఖ్యు లో ఉప్పలవారు ఒకరు. అతడు-ఆమె నవలా రచనలో కొత్తతరహా దృక్ప థాన్ని ప్రవేశపెట్టిన ప్రముఖ రచయిత లక్ష్మణరావు మాస్కో ప్రగతి ప్రచుర ణాలయం తెలుగు శాఖలో ఒకటిన్నర దశాబ్దాలకు పైగా పెక్కు ఉత్తమ గ్రం థాలకు,నిఘంటువులకు సంపాదకత్వం వహించి, రష్యన్ భాషనుండి ఎన్నో చక్కని బాలల పుస్తకాలను తెలుగు లోనికి అనువదించారు లక్ష్మణరావు గారు. ఏడాది క్రిందట వెలువడిన వీరి స్వీయచరిత్ర 'బ్రతుకుకథ'లో ఆనాటి సామాజిక స్థితిగతులు, విదేశ విశ్వవిద్యాలయాలలో భారతీయ విద్యా ర్థుల అనుభవాలు భారత స్వాతంత్ర్యో ద్యమ విశేషాలు దర్శించవచ్చు. ఉత్తమ వ్యక్తిత్వం కలిగిన దేశభక్తుడు, విజ్ఞానవేత్త, సామ్యవాది, స్వర్గీయ ఉప్పల లక్ష్మణరావుగారు.

—మనూనా

'శుభోదయ'లో

### సోషలిస్టులు

రష్యా, ఐర్లండు, చైనా, విప్లవాల తాలూకు సాహిత్యాన్ని కొంత తెలుసు కున్నాము. తత్ఫలితంగానే మాగ్జిం

గోర్కి రచించిన మదర్ అనే బ్రహ్మాండమైన నవల నన్ను ఆకర్షించింది. ఒక ఉత్సాహంతో 'అమ్మ' అనే పేరుతో తెలుగు చెయ్యడం జరిగింది. అది యువకులను బాగా ఆకర్షించింది. అప్పటి గవర్నమెంటు దానిని నిషేధించడం వల్లకూడా దాని ప్రచారం ఎక్కువ అయింది. తత్ఫలితంగానే నాలో సామ్యవాద భావాలు వికసించాయి. అప్పట్లో జైళ్లలో ఎన్నో కష్టాలు అనుభవించి ఆశాభంగం చెందినవారెందరో సామ్యవాదులుగా మారి బైటికి వచ్చారు. గాంధీజీని, జవహర్‌లాల్‌ను, అలాంటి పెద్దలను కాదని కాంగ్రెసును ఎదుర్కొనే శక్తిచాలక కాంగ్రెసులో అంతర్భాగంగానే జయప్రకాశ్, నరేంద్రదేవ్, తిలక్ మెహతా, కమలాదేవి చటోపాధ్యాయలాంటి వారు కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ కాశీలో ప్రారంభించారు. అందులో నేనూ, సుందరయ్య వగైరా యువకులు ఆంధ్ర పార్టీని నిర్మాణం చేశాము.

—క్రొవ్విడి లింగరాజు
'గాంధీక్షేత్రం' లో

## మిరియం

పన్నెండు కాల్చిన మిరియాలను రోజూ ఒకసారి తీసుకుంటే దగ్గూ ఉబ్బసమూ, రొంప పోతాయి. మూడు మాడ్చిన మిరియాలను తమలపాకుతో నమిలితే విదాహం కడుతుంది. రెండు మిరియాలు మేకపాలతో గంధం తీసి ముక్కు పుటాలలో పెట్టుకుంటే తలనొప్పి తగ్గుతుంది, ఇరవై గ్రాముల మిరియపు పొడి, కొద్దిగా పసుపు పొడితో కలిపి పాలలో వేసి మరిగించి, రోజుకొకసారి మూడురోజులు తాగితే కొరైజా అను వ్యాధి నిరోధిస్తుంది. ఆరు మిరియాలను నాలుగు బాదం పలుకులతో కలిపి, పాలతో రోజూ పుచ్చుకుంటే మంచి నెర్వ్‌టానిక్‌గా పనిచేస్తుంది. మెత్తటి మిరియపు పొడిలో ఉప్పు పొడి కలిపితే మంచి పళ్ళపొడి తయారవుతుంది. దీనితో దంతధావనం చేస్తే, నోటిలోని దుర్గంధం పోయి పళ్ళు గట్టిపడతాయి. లవంగ నూనెలో కొద్దిగా మిరియపుపొడి కలిపి, పుప్పిపంటి మీద పెడితే నలుపు తగ్గుతుంది.

—వ్యాసభాగం 'అన్నదాత'

# మానవ ప్రగతి

## పరి రక్షణ

అంతరించి పోతున్న మాతృభాష పరిరక్షణ కోసం ఇద్దరు ద్వీపవాసులు ఇటీవల అమెరికాలోని ఫ్లోరిడా విశ్వ విద్యాలయాన్ని సందర్శించారు. ఈ అలిఖిత భాషను పరిరక్షించేందుకు అక్కడ వీరికి ఒక ఆంత్రోపాలజీ ప్రొఫెసరు తన సహాయాన్ని అందించారు. ఈ ద్వీపవాసుల పేర్లు - రీటా ఇనోస్, డేమియన్ సోల్. పసిఫిక్ సముద్రంలోని రోటా దీవులు వీరి జన్మస్థలం. ఇనోస్ వయసు 20 సంవత్సరాలు. ఈమె ఒక స్థానిక పాఠశాల ప్రిన్సిపాలుగా ఉన్నారు. సోల్ ఆ ద్వీప శాసన సభ్యుడు. పసిఫిక్ తీర ప్రాంతంలో గామ్ పట్టణానికి ఉత్తరంగా 72 కి.మీ. దూరాన ఈ ద్వీపం ఉన్నది. ఈ ద్వీప జనాభా 2200. మాతృభాషలో వ్రాయటం నేర్చుకోవాలని సోల్ ఆకాంక్ష. ఆ ద్వీపం గతాన్ని పరిరక్షించి, తన ప్రజలతో మాతృభాషలోనే మాట్లాడాలని ఆయన కోరుకొంటున్నారు. ఆయన తన రాకకు కారణం తెలుపుతూ, "నేను ఇక్కడకు (ఫ్లోరిడా విశ్వవిద్యాలయానికి) రాకపోతే, నా మాతృభాష, నా ప్రజలు ఈ కాల ప్రవాహంలో గతించి పోగలరనే భయం నన్ను పీడించింది" అని ఆయన అన్నారు. ఫ్లోరిడా విశ్వవిద్యాలయంలోని డా. హెచ్. రసెల్ బెర్నార్డ్ వీరికి ఆధునిక "ప్రింటింగ్ ప్రెస్" అనబడే కంప్యూటరు గురించి తెలియచేశారు. ఇది ముద్రణాయంత్రానికి అనుసంధానం చేయబడిన ఒక 'వర్డ్ ప్రొసెసర్.' కంప్యూటరు ఉపయోగించి వ్రాయటం చాలా సులభం. పైగా, ఇవి మూలాన్ని యథాతథంగా నిల్వకూడా చేయగలదు. ఒక నకలు యంత్రంతో ప్రపంచంలోని రెండు వేల అలిఖిత భాషలను పరిరక్షించగల ఆదర్శవంతమైన పరిష్కారం ఇది అని ఆయన తెలియచేశారు.

## కృత్రిమ మన్ను

ఒక చదరపు మీటరు మామూలు నేల నుండి 70 రోజులలో 1 కిలోగ్రాము ముల్లంగిని పండించగలిగితే,

యీ కృత్రిమ నేలలో 21 రోజుల లోనే 10 కిలోగ్రాముల ముల్లంగిని పండించవచ్చు. ప్రయోగశాలలోనే గాక, హిమ విచ్ఛేదక 'క్రాసిన్' నౌక లోని 8 చదరపు కిలోమీటర్ల వైశాల్యం గల కృత్రిమ నేలపై కూడా మొక్కల పెంపకం జరుగుతున్నది. "లియోనిద్ బెజ్నేవ్" అను అణు శక్తి చోదిత నౌకలో 20 చదరపు మీటర్ల వైశాల్యంగల కృత్రిమ నేలను సిద్ధం చేయడం జరిగింది. దీనిపై ముల్లంగి, టొమాటో, గుమ్మడి వంటివి నెలకు రెండుమూండల కిలోగ్రాముల దాకా పండించబడుతున్నాయి........

....ఈ కృత్రిమ మన్ను అవసరం బాహ్యాంతరిక్షంలోనేగాక, వేలాది సముద్ర నౌకలలోను, సైబేరియా, సుదూర ఉత్తరాదులలో గల పారిశ్రామిక సంస్థలలోను చాలా ఎక్కువగా వుంటుంది. సస్యోత్పాదక ఉష గృహాలు 200 సంవత్సరాల క్రితం కనిపెట్టబడ్డాయి. ఆనాటినుండి యివి పెద్దగా మారలేదు. కృత్రిమ మన్ను సృజన మూలంగా మౌలికంగా వినూత్నమైన సస్యోత్పాదక విధానం అమలులోకి వస్తుంది. ఈ మొక్కలకు దిగువన 20 సెంటీమీటర్లు, పైన 20 - 25 సెంటీమీటర్లు, కృత్రిమ వెలుగు కోసం మరో 50 సెంటీమీటర్ల ఎడం అవసరమవుతుంది. ఒకదానిపై మరొకటి 40-50 అంతస్తులుగా పేర్చుకుంటూ పోతే యీ ఉష్ణ గృహం ఎత్తు 40-50 మీటర్లు అవుతుంది. ధృవప్రాంతంతో సహా మనకు అవసరమయిన చోటనల్లా యీ పద్ధతిలో సంవత్సరం పొడుగునా అవసరమయిన మేరకు కూరగాయలు పండించుకోవచ్చు.

## 'థార్'

ప్రపంచంలోని ఇతర పెద్ద ఎడారులయిన సహారా, కలహారి, అటకామా, గోబీల వలె థార్ ఎడారి కూడా క్రమక్రమంగా మనుషులు, చెట్లు, జంతువుల కదలికలతో నిండిపోతున్నది. రాజస్థాన్‌లో పడుతున్న సూర్యకాంతిని సరిగా సద్వినియోగపరచుకున్నట్లయితే, మన భూప్రపంచానికి కావలసిన ఇంధనాన్ని సమకూర్చుకోవచ్చునని శాస్త్రజ్ఞులు చెబుతారు. థార్ ప్రాంతంలో 190 లక్షల మంది ప్రజలు జీవిస్తున్నారు. 1 చ కి.మీ. ప్రాంతంలో 61మంది నివసిస్తున్నారు. అధికభాగం ఎడారి ప్రాంతమయిన ఈ ప్రదేశంలో ఈ జన సాంద్రత ఎక్కువకిందే లెక్క. ఎందుకంటే మిగిలిన ఎడారి ప్రాంతాలలో సరాసరిన 1 చ.కి.మీ. ప్రాంతంలో నివసించేది ముగ్గురు మాత్రమే. 1952లో ఇక్కడ జీవించే పశువుల సంఖ్య 102.7 లక్షలుండగా అది ఇప్పటికి 230 లక్షలకు పెరిగింది.

....భారతదేశంలో మొత్తం 32లక్షల చదరపు కిలోమీటర్ల భూమి నీటి సదుపాయం లేకుండా వుంది. దేశంలోని భౌగోళిక ప్రాంతంలో ఇది 12 శాతం. దేశమంతటా వ్యాపించివున్న ఇసుక మైదానాలకు, ఇసుక దిబ్బలకు

ఎడారి ప్రాంతాలకు ఎటువంటి రాజకీయ సరిహద్దులు లేవు. రాజస్థాన్‌లోని ఇతర 11 జిల్లాల వలె కాక, థార్ గుజరాత్, హర్యానాలలోని కొన్ని ప్రదేశాలను కూడా ఆవరించుకొని వున్నది. మరొక 90,000 చదరపు కిలోమీటర్ల ప్రాంతం హిమాలయాల ప్రభావంతో ఉత్తర ప్రాంతాన మంచు ఎడారిగా మారిపోయింది.

## ధ్వని ద్వారా

'ధ్వని' ద్వారా దృష్టిని కాపాడవచ్చా? ఆరోజు త్వరలో రానున్నదని వైద్యపరిశోధకులు అంటున్నారు. తీవ్ర కంటి వ్యాధులకు గురైన వారి దృష్టిని కాపాడ్డానికి మనకు వినిపించని ధ్వని తరంగాలను (అల్ట్రాసౌండ్) వాడుతున్నారని, సైన్స్ న్యూస్ అనే అమెరికన్ పత్రిక తెలియజేస్తున్నది. ప్రపంచం అంతటలో లక్షలకొద్ది పెద్దలు, పిల్లలు గ్లాకోమా అనే జబ్బుకు గురవుతున్నారు. కంటినరం క్షీణించటంవల్ల, వారి చూపు సరిగా రాకపోవటమో, అంధత్వానికి గురవటమో జరుగుతుంది. మందులివ్వటమో, ఆపరేషన్లు చేయటమో మామూలు పద్ధతి. అయితే అందరూ వీటివల్ల లాభపడరు ఈ కొత్త ధ్వని తరంగ ప్రక్రియను న్యూయార్క్‌లో-కార్నెలు యూనివర్శిటికి చెందిన జాక్‌సన్ కోలేమన్, రివర్‌సైడ్ రిసెర్చి ఇనిస్టిట్యూట్‌కు చెందిన ఫ్రెడరిక్ లిడ్జి కనిపెట్టారు.

## రోబో

"యంత్రాల మేధశ్శక్తి ఉపయోగ విషయాలందు నాకు ఆసక్తి మెండు" అని బెర్కిలీలోని కాలిఫోర్నియా యూనివర్శిటీలో ఎలెక్ట్రికల్ ఇంజనీరింగ్ ప్రొఫెసర్‌గా ఉన్న డా. శంకర శాస్త్రి అన్నారు. శాస్త్రి ముఖ్య ఆసక్తి రొబొటిక్స్; అంటే స్వయం శక్తితో పనిచేయగల యంత్రాల నిర్మాణం, వాటి నిర్వహణ. ఈ యంత్రాలు వైజ్ఞానికంగా ప్రమాదకరమైన పరిసరాలలో ఉపయోగపడగలవు. ఈయన అగ్నిమాపక విధానాలలో, సముద్రపు లోతులలో పరిశోధనలకు, మైక్రో ఎలెక్ట్రానిక్స్ పరిశ్రమలలో ఉపయోగకరమైన రోబోలను తయారు చేయటంలో లీనమైఉన్నారు. "ఒక కృత్రిమ మేధస్సుగల రోబో (మరమనిషి) స్వయంగా తన పరిసరాలను కలయచూసి అంచనా వేయగలదు. ఉదాహరణకు, రోబో తన దారిలో అడ్డంకులను గుర్తించి తప్పుకుపోగలదు. అగ్నిమాపక రోబోలు తమకు అతి కొత్తవైన ఇండ్లలో కూడా సులభంగా దారి తెలుసుకుని అగ్నికి కారణమైన గదిలోకి దారితీసి అగ్నిని ఆర్పి బయటకు రాగలవు" అని శాస్త్రి వివరించారు. పూనెలో జన్మించిన శాస్త్రి, బొంబాయిలోని ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీలో ఎలెక్ట్రికల్ ఇంజనీరింగ్ పట్టా పొంది, ఆ పిదప అమెరికాలోని బెర్కిలీకి వెళారు.

# నిశ్చయం

సత్యావం

"శ్రీ దేవమ్మ! మళ్ళీ నీళ్ళు పోసుకుంది. ఆరోనెలట" ఇదీ యీసారి రమణమ్మగారు బందరు వెళ్ళి వస్తూ తెచ్చినవార్త. కాపరంచేసే ఇల్లాలు, కడుపుతో వుండటంలోగల వింతేమీ లేదుగానీ, అప్పటికే శ్రీ దేవమ్మకి ఆరుగురు ఆడ - ముగ్గురు మగ సంతానం వున్నారు. పధ్నాలుగేళ్ళకే పెళ్ళిచేసి అత్తవారింటికి పంపిన పెద్ద కూతురు ఒక పిల్లాడి తల్లి. రెండో కూతురు రాధ పెళ్ళయి సంవత్సరం కూడా కాలేదు అప్పుడే పురిటికని పుట్టింటికి వచ్చిందట "శ్రీ దేవమ్మకీ చిన్నకూతురుకి ఒక నెల తేడాగా పురుడు రావచ్చు" అని చెప్పింది.

"శ్రీదేవమ్మని ఆపరేషన్ చేయించుకోరాదా, బొత్తిగా వోపిక లేకుండా వున్నావు?" అని ఎవరో వుచిత సలహా చెప్పారుట. దానికావిడేం సమాధానం ఇచ్చిందో తెలుసా? "ఆ, ఇంకా కన్నంత మందిని కనలేనుకదా! మహా వుడితే, ఒకరో, ఇద్దరో, ఆమాత్రానికే ఆపరేషన్ అంటూ ఎందుకొచ్చిన గొడవ, దానివల్ల ఏ అవసరమన్నా వస్తే, నా పిల్లలగతి ఏమవుతుంది? అయినా ఆపరేషన్ తరువాత ఆర్నెల్ల పాటన్నా, కూర్చోపెట్టి చెయ్యాలిట. నా కెవరు చేస్తారు?" అంటూ దీర్ఘం తీసేసరికి, ఆ సలహా చెప్పినావిడ నోరు మూసుకుని చక్కాబోయిందిట"

అంటూ విశేషాలన్నీ పినతల్లి రమణమ్మ చెప్తుంటే వింటున్న లక్ష్మికి నవ్వు వచ్చింది. 'కన్నంతమందిని కనలేనుగా!' అనటంలో ఏమిటో ఆవిడ వుద్దేశ్యం ఓపికవుంటే కనాలనే వుందికామోసు. అందుకే పూర్వకాలంలో పెద్దవాళ్ళు- "కన్నమ్మకే పాపి, తిన్నమ్మకే పాపి;" అన్నారుట. శ్రీదేవమ్మలాంటి వాళ్ళని చూసే వాళ్ళా మాట అనివుంటారు. ఇప్పటికే తొమ్మండుగురు పిల్లలున్నారు. పొలం చూడబోతే 'ఏడెకరాలుండేది కాస్తా ఆడపిల్లలిద్దరి పెళ్ళిళ్ళకి చెరొక ఎకరం అమ్మేశారు. ఇహ వున్నది అయిదెకరాలపొలం, కరణీకంమీద వచ్చేజీతం డబ్బులు, అధికార్లువస్తే భోజనాలు పెట్టడానికే చాలవు. మరి ఏ ధీమాతో శ్రీదేవమ్మ వుండగలుగుతోందో లక్ష్మికి అర్ధంకాలేదు.

చేతికంది వచ్చినవాడు ఎందుకూ కొరగాకుండా పోయాడు. మిగతా అంతా అంతా కూన గురుజు. ఈవిడ యీ

లెక్కలోనే వుంటే, మరో అరడజను మందిని అలాగ్గా కనేస్తుంది ఆ తరువాత వాళ్ళేమైనాకానీ. 'నారుపోసినవాడు నీరుపొయ్యడా!' అన్న మెట్ట వేదాంతమే ఇలాంటివాళ్ళ మొండి వాదదా. లక్ష్మి ఆలోచనలన్నీ, శ్రీదేవమ్మ చుట్టూతా తిరుగుతూనే వున్నాయి. చిన్నవాడు వచ్చి అమాంతంగా, తల్లి మీద పడ్డాడు. పరాకుగా వుందేమో ముందుకు పడబోయిన లక్ష్మిని రమణమ్మ చటుక్కున చెయ్యి అడ్డు పెట్టి ఆపింది.

"వెధవ నాగన్నా! వుండు నీ పని చెప్తాను. అమ్మమీద అట్లా పడవద్దని ఎన్నిసార్లు చెప్పాను" అంటూ లేచే నరికి చిన్నవాడు నాలిక బయట పెట్టి అమ్మమ్మని వెక్కిరించి పారిపోయాడు.

"సూపర్ తెలివితేటలెక్కువయ్యాయమ్మ కుర్రవెధవలకి మరీను ఇచ్చిన దేముడు మర్చిపోతే వీళ్ళిద్దరు మగపిల్లలు, పుట్టబోయే ఆడపిల్లా చాలేమ్మా నీకు! ఆపరేషన్ చేయించుకో! యీ పిల్లలతో పడలేవు. అవునుగానీ అల్లుడికి చెప్పావా?" అన్నది రమణమ్మ.

తను ఎవరినీ కనకపోయినా, చుట్టుపక్కల పిల్లలని దాదాపు ముప్పయి నలభై మందిని తన చేతులమీదుగా పెంచింది రమణమ్మ. ఏ పసిబిడ్డని చూపినా ఆవిడ ఎంతో సంతోష పడుతుంది. అలాంటి మనిషి, పిల్లలు చాలు అని సలహా ఇస్తోంది. అంటే, దానికా విడ వాస్తవికదృష్టే కారణమని లక్ష్మి గ్రహించింది. ఏఎండ కాగొడుగు అన్నట్లు, ఎప్పటి పరిస్థితులకప్పుడు అనుగుణ్యంగా, 'నొప్పింపక తానొవ్వక' అన్నట్లుగా సంచరించి, ఎవరింటికి వెళితే వాళ్ళకే ఆత్మీయురాలయ్యే యీ పినతల్లి అంటే లక్ష్మికి మొదటినుంచీ అభిమానమే! అదే ఇప్పుడు కొంచెం పెరిగింది.

"మీ అల్లుడెప్పుడు అడ్డుచెప్పాడు పిన్నీ, నాదేఆలస్యం?" అన్నది లక్ష్మి.

లక్ష్మికీ పెళ్ళయి ఆరేళ్ళయింది. భర్త గ్రామమునసబుగా, పోస్టుమాస్టరుగా పనిచేస్తున్నాడు. పిత్రార్జితం నాలుగెకరాల పొలం వుంది, ఇల్లు వుంది. ఇల్లాలు రాగానే పిల్లలు వచ్చారు. పెద్దపిల్లాడి తరువాత ఆడపిల్ల పుట్టి పురిట్లోనే పోయింది తరువాత మళ్ళీ మగపిల్లాడే. ఇప్పుడు నిండు నెలలు. ఈసారి ఆడపిల్ల పుడితే ఆపరేషన్ చేయించుకోవాలన్న ఆలోచనతోనే పినతల్లిని రప్పించుకున్నది లక్ష్మి. ఆడపిల్లే అని లక్ష్మి అనుకోవటానికొక కారణంవుంది. లక్ష్మి తల్లికి ఒకఆడ ఒకమగ చొప్పున వరస కానుపులు. అత్తగారికీ అంతే, చావగారికీ అంతే, తనకీ మూడుకానుపులు వరసగానే వచ్చాయి. అదీగాక పేనుసు క్రింద వేసి పైన బూడిదవేస్తే బూడిదలోంచి పేను క్రిందగావస్తే, ఆడపిల్ల అనీ పైగావస్తే మగపిల్లవాడనీ శకునం అంటారు. పేనుకూడా ఆడపిల్లే పుడుతుందని చెప్పింది. సోది అమ్మాయిని సోది అడగ్గా, అదీ ఆడపిల్లే అని చెప్పింది. ఇన్ని కారణాలవల్ల లక్ష్మి తనకీసారి ఆడపిల్లే అన్న ధీమాతోవుంది.

నొప్పులు మొదలవ్వగానే లక్ష్మి బండీమీద వెళ్ళి బెజవాడలో తమలేడీ డాక్టర్ నర్సింగ్ హోమ్‌లో చేరింది. ఆ సాయింత్రానికే లక్ష్మి వూహ లన్నిటిని తారుమారుచేస్తూ అబ్బాయే పుట్టాడు. లక్ష్మికి కళ్ళనీళ్ళ పర్యం తం అయింది. ఆడపిల్ల కావాలని కదా తను అనుకున్నది. ఆపరేషన్ అని కాకపోతే, యీ నర్సింగ్ హోమ్‌కి రావటం ఎందుకు? తన కానుపులన్నీ చాలా సులువుగా జరిగి పోతాయి. ఇంటిదగ్గరే - ఇప్పటికైనా మించిందేముంది, ఇంకోసారి చూస్తాను అని తననితానే సముదాయించుకుని, ఆ సంగతే డాక్టరమ్మతో కూడా చెప్పింది. అయితేమూడోరోజు ఇంటికి వెళ్ళవచ్చని చెప్పిందావిడ.

కాలక్షేపంకోసం లక్ష్మి చుట్టుప్రక్క లవాళ్ళతో పరిచయం చేసుకుంది. ప్రక్కమంచం ఆవిడకి నలుగురు ఆడ పిల్లలుట. యీసారి మగ పిల్లవాడు పుట్టాడని ఆపరేషన్ చేయించుకుందా విడ "ఏహూడపిల్లలోతల్లీ! నాప్రాణాలు కొరికేస్తున్నారు. గొలుసు అనీ రిబ్బన్లు అనీ పలక పుస్తకాలు సరే సరి. నలు గురుకీ ఒకేరకం గుడ్డలు కావాలం టారు. మా ఆయనకొచ్చేది అరువం దల రూపాయలు. మగనలుసు కోసం అని ఆశపడి ఈ మూకనంతా కన్నాను. లేకపోతే ఎప్పుడో ఆపరేషన్ చేయించు కునేదాన్ని. ఇక వీళ్ళకి ఏమిచ్చి పెళ్ళిచేయ్యాలో తల్చుకుంటే భయంగా వుంది. వచ్చేదంతా తిండికే చాల నప్పుడు వీళ్ళ పెళ్ళిళ్ళకని ఎక్కడ దాయను?" అంటూ ఆవిడ తన గోడు వెళ్ళబోసుకుంది. ఆవిడ బాధ చూసి లక్ష్మి నవ్వుకుంది. మహాలక్ష్మి, వర లక్ష్మి, జయలక్ష్మి, ధనలక్ష్మి, అన్న పేర్లకి తగ్గట్టుగానే ఆ నలుగురు ఆడ పిల్లలు పచ్చగా దబ్బపండ్లలా వున్నారు. వాళ్ళని చూస్తుంటే, ఆడ పిల్లకావాలన్న కోరిక మరీఎక్కువైంది లక్ష్మికి. ఆడపిల్ల నట్టింట తిరుగుతూ వుంటే ఎంత కన్నుల పండువుగా వుంటుంది! అసలు ఇంటికి కళాకాంతీ అంతా ఆడపిల్లలదేగదా మొగవెధవలకే ముందీ! పట్టి బోడితలలు, ఆరేళ్ళన్నా లేవు తన పెద్ద కొడుక్కు. అప్పుడే వాడు పుట్టినరోజు పేరంటం అన్నా, భోగిపళ్ళు పోస్తానన్నా వద్దంటాడు. అన్నకూర్చుంటేనే నేను కూర్చుంటా నంటాడు చిన్నవాడు. వాడికి ప్రతిదానికీ అన్నతో పంతే! ఆడపిల్లఅయితే పదేళ్ళ వరకు భోగిపళ్ళు పొయ్యొచ్చు. తరువాత బొమ్మల పేరంటం అన్నీ ఎన్నో ముచ్చట్లు. పూలజడవేసి, పట్టు పరికిణీ జాకటుతొడిగి కళ్ళకి కాటుక పెడితే ఎంత ముద్దుగా వుంటుందో! ఏం వున్నా, ఆడపిల్లతోనే అచ్చటా ముచ్చటా జరుగుతాయి. పెద్ద పిల్లల వగానే పెళ్ళీపేరంటం అత్తవారింటికి పంపటం, మళ్ళీ పండుగులకి, పబ్బా లకీ, పురుళ్ళకి పుణ్యాలకీ, మనవలూ, మనవరాళ్ళు ఓహ్ ఎంత సంబరంగా వుంటుందనీ! ఆ తర్వాతెప్పుడన్నా కోడళ్ళతో మాట మాట వచ్చినా చేసినా "అమ్మా ఇట్లా వుందే నాపనీ!" అని కడుపులో మాట చెప్పుకునేందుకు

పెద్దతనంలో కూతురు ఎంత ఆస రాగా వుంటుందీ! కొడుకులెంత ప్రేమగా వున్నా కోడలు అంటూ వచ్చినాక కొంతమార్పు రాక తప్పదు. అయినా చీటికి మాటికి కడు పులో మాట కొడుకుతో ఏం చెప్పు కుంటాము? అత్తవారింట్లో వుండి ఏడాదికొకసారి వచ్చే కూతురైతే సానుభూతిగా వింటుంది. 'అయ్యో అమ్మ!' అంటుంది. ఎల్లాగైనా ఆడ దాని బాధలు భయాలు ఆడదానికే తెలుస్తాయి - మగవాడికేం తెలు స్తాయి? ఆడపిల్ల కావల్సిందేనని లక్ష్మి మరోసారి గట్టిగా నిశ్చయించుకుంది.

"ఓరి దేముడా! ఇలాంటి ముదనష్ట పోడిని నాకెందుకిచ్చావయ్యా! ఆడికేం తక్కువజేశాననీ వెధవపని చేశాడు. ఇప్పుడెట్లా నేనింటికి రావాలంటే, డాక్ట రమ్మకి ఫీజుకట్టాలికదా! ఎక్కడినుంచి తేను? ఇప్పుడే మహారాజు అప్పిస్తాడు? అంటూ గోలపెట్టి ఏడుస్తోంది నాలుగో మంచంమీద పేషెంట్. సంగతేమి టని లక్ష్మి విచారించగా, ఆవిడకి యీ కాన్పుతో ఆరుగురు మగపిల్లలు. ఆడ పిల్లకోసం అని చూస్తుంటే వరసగా అంతా మగపిల్లలే! ఇంటి దగ్గర పురిటి కని దాచిన వందరూపాయాలు పట్టు కుని పెద్దపిల్లడు ఎక్కడికోపోయాడుట. తతిమ్మవాళ్ళంతా కూనగురుజానట. ఆ పెద్ద వెధవకి చదువు సంధ్య అబ్బ లేదుట. వాళ్ళనాన్న జేబులోంచి అప్పు డప్పుడు పదీపరకా తీసుకుపోతూనే వుంటాడుట. కానీ పెట్టెతెరచి, ఇంత పెద్ద మొత్తంగా ఎప్పుడు తియ్యలేదని, ఆవిడ కన్నీరుమున్నీరుగావకటే ఏడుపు "బాలమ్మ, ఇంక ఆడపిల్ల వద్దు అధ్వ న్నము వద్దు. ఆపరేషన్ చేయించు కుంటాను. యీ వున్న వెధవలకి కుదురుకూరాడు అబ్బితే అదే పది వేలు" అన్నదావిడ.

లక్ష్మి మనసు వికలమైపోయింది. ఫీ ఏంపిల్లలు వెధవపిల్లలు. అనిపించింది. "బాబూ! నువ్వట్లా కాకూడదురా! నలుగురి చేత సెబాష్ అనిపించు కోవాలి" అంటూ ఆప్యాయంగా, తన బిడ్డ తలని నిమిరింది.

మరోమంచం. ఆమెకొడుకు ఆరేళ్ళ వాడు. ఇంటిదగ్గర నాయనమ్మ మాటలు అసలు వినటం లేదుట. తల్లి దగ్గరకి పోతానని ఏడ్చి హాస్పటల్‌కి వచ్చాడు. వచ్చినవాడు వచ్చినట్లుండక అందర్ని వక్కొ్కలిక్కి తెస్తున్నాడు. నర్సులు చీటికి మాటికి వాడిని కసిరికొడు తున్నారు.

మరో ఆమెకి, లక్ష్మి లాగానే ముగ్గురు మగపిల్లలే. ఆడపిల్ల కావా లని ఆవిడగొడవ. అత్తగారు మొగుడు బ్రతిమాలుతున్నారు. వీళ్ళని పట్టటం నా శక్యం కాదు, అని అత్తగారు, వీళ్ళని పెంచేసరికి నాతాడు తెగుతుంది. ఇంకా ఆడపిల్లలంటావేం? అని భర్త గొడవ చేస్తున్నారు. అదీ నిజమే అని పించింది లక్ష్మికి. తమకైనా అంతే. కదా! వీళ్ళముగ్గురినీ పెంచిపెద్దచేయ్యా లంటే చాలా అవస్థపడాలి తన భర్తకి ప్రతినెల ఆదాయంకాక పిత్రార్జితం నాలుగెకరాల పొలం వుండబట్టి ఎట్లాగో బండి లాక్కు వస్తున్నారు.

తాలూకా కేంద్రం అవటం వలన, భర్త వైపు వాళ్ళు తనవైపు వాళ్ళు చుట్టు ప్రక్కల పల్లెటూళ్ళనుంచి వచ్చిపో తూనే వుంటారు. ఎవరిని కాదనటం? అందరూ కావలసిన వాళ్ళేమరి! సంసారమట్లావుంటే పిల్లలుకూడా పెరి గితే ఎట్లా? ఈసారి ఆడపిల్ల కలుగు తుందనిగట్టిగా నమ్మింది తను. అయినా మగపిల్లవాడే పుట్టాడు. మరోసారి ఆడపిల్లన్న నమ్మకమేమిటి? అసలు వీళ్ళందర్నీ పెంచి పోషించటం సంగతట్లా వుంచి, వీళ్ళకి కుదురు చదువు అబ్బవద్దూ! లేకపోతే ఎందుకు కొరగాకుండాపోతారు. ఈ రోజుల్లో మగపిల్లలకి కుదురు రావటం చాలా అదృష్టం! చిన్నక్క కొడుకు 'వద్దురా నాయనా!' అంటే వినకుండా, జై ఆంధ్రా వుద్యమంలో తిరిగి లాఠీ దెబ్బలుతిని చెయ్యి విరక్కొట్టుకున్నాడు. మూడేళ్ళబట్టి పరీక్ష తప్పతూనే వున్నాడు. ఇప్పుడు చెయ్యికూడా లేదు. వాడి జీవితం ఏమైపోతుందా అని అది కంటికిమంటికీ ఏకధారగా ఏడుస్తుంది. మామయ్య కొడుకు ఫోర్తుఫారం నాలుగుసార్లుతప్పి ఇంట్లోంచి పారి పోయి, ఎక్కడో హోటల్లో క్లీనర్‌గా వున్నాడుట. సరే శ్రీదేవమ్మ కొడుకు రాఘవుడికి అబ్బని దుర్గుణం లేదు. వీళ్ళనే ఏమిటి! యీరోజుల్లో చాలా మంది మగపిల్లలు కుదురు లేకుండా పోతున్నారు. తమ పక్కింటి వాళ్ళ బ్బాయి తను అడిగిన ఫ్యాషన్ పాంట్ కుట్టించలేదని రైలుక్రింద తల పెడ తానని ప్రయత్నిస్తే వాళ్లు వీళ్లు చూసి లాక్కువచ్చారు. ఈపిల్లలకెంత సేపు సినిమాలు, ఫేషన్లు, హోటళ్ళు తప్ప, 'అయ్యో తల్లితండ్రుల స్థితి గతులెట్లావున్నాయి? మన గొంతెమ్మ కోర్కెలు తీర్చేస్తోమతలో వున్నారా, లేదా?' అన్న ఆలోచనే లేదు సరికదా కోరింది కాదు అంటే 'చస్తాం' అంటూ ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు. ఎక్కడ చూసినా ఇదేతంతుగా వున్నది. ఇలాంటి పిల్లలు ఇంకా కావాలను కోవటం అంటే కోరిబాధలనికొని తెచ్చు కోవటమే అవుతుంది. ఆ భగవంతుని దయవల్ల యీ ముగ్గురు పిల్లలకీ కుదురూ చదువూఅబ్బితే అదేపదివేలు. ఆడపిల్లలేకపోతే మానే-వచ్చేకోడళ్ళనే ఆడపిల్లలనుకుంటాను. అంతేగాని, ఇంకా పిల్లలు వద్దు బాబోయ్! బుద్ధి వచ్చింది" అనుకుంది లక్ష్మి.

ఆ సాయంత్రం, భర్త తనని చూడ టానికి రాగానే చెప్పేసింది తన నిర్ణయం. "పోనీలే లక్ష్మి, మరొకసారి చేయించుకుందుగానీలే - ఆడపిల్లలంటే నీకిష్టంకదా!" అన్నాడతను.

"మరోసారిఆడపిల్ల పుడుతుందన్న గ్యారంటీ ఏం లేదుకదండీ! ఆవిడని చూడండీ! వరసగా ఆరుగురూ మగ పిల్లలేట-అట్లాగే మనక్కూడా అవుతే? వద్దండీ! మన స్థితికి, యీ ముగ్గురు చాలు. మీరు 'వద్దు' అంటే నా మనస్సు మెత్తబడవచ్చు. అందుకని ఇప్పుడే వెళ్ళి డాక్టరమ్మకి చెప్పిరండి" అంటూ భర్తని తొందరచేసి డాక్టరమ్మ దగ్గరకి పంపింది లక్ష్మి.

నవయువత

# వేపుకథ

## పువ్వాడి రంగ

సాయంత్రం నాలుగు గంటలవేళ. వాతావరణమంతా మబ్బుపట్టి చల్లగా హాయిగా, ఆహ్లాదంగావుంది. ఆ వాతావరణం అలావుంటేనే బాగుంటుంది రాధకు. కాని అది వానగా, జడివానగా మారటం ఇష్టముండదు. మబ్బుపట్టిన వాతావరణం అవ్యక్తానుభూతి నిస్తుంది. ఆ సమయంలో అందమైన ఊహల్లో-మధురసీమల్లో విహరిస్తుంది. వంటగదిలో పనివున్నా చెయ్యదు. ఆ పని ఎవరైనా చేస్తే బాగుంటుంది రాధకు.

ముందు వరండాలో వాలుకుర్చీలో పడుకున్న రాధ పక్కవాటాలో వుంటున్న సీతను "సీతా! సీతా!" అంటూ పిలిచింది. పిలవటమే తరువాయి ఎదుట హాజరయింది సీత.

"చూడు, సీతా! పనిచెప్తున్నానని అనుకోకు. వంటగదిలోకి పోయి డబ్బాలో సెనగపిండి తీసి, మస్తుగా ఉల్లిపాయలు ముక్కలు పచ్చిమిర్చి ముక్కలు వేసి, వేడి వేడిగా పకోడీలు వేసి, కాఫీ పెట్టు. టిఫిన్ కాఫీ నలుగురికి సరిపడా చేసెయ్. మళ్ళా రవికి వేరే టిఫిన్ ప్రయత్నం చెయ్యకు. రేవు నీకిష్టమైన మరువాలు, మల్లెలు కొని పెట్టి ఫస్టుషోకు తీసుకువెళతాను. సరేనా?" అంది రాధ నవ్వుతూ. సీత కూడా నవ్వుతూ లోపలకు వెళ్ళింది.

పక్కవాటాలో వున్న సీతకు 'నా' అనేవారు లేరు - ఉద్యోగం చేస్తున్న రవి తప్పించి. అలాగే రాధ ........ లోపల పిండి కలుపుతున్న సీతను మళ్ళా పిలిచింది రాధ.

"అల్మారాలో బౌండు, పెన్ను వున్నాయి. తెచ్చి పెట్టవూ!"

"మళ్ళా కథ రాస్తావా ఒదినా?" అంది సీత నవ్వుతూ.

"ఏమో" అంది రాధ.

ఆఫీసులో టైపుమిషన్ మీద శ్యామల వేళ్ళు లయబద్ధంగా కదులుతున్నాయి. 'లేటు' గా వచ్చి అలవాటుగా చీవాట్లు తిని, తన సీటులో కూర్చున్నాడు పక్కగదిలో శ్యామ్‌సుందర్. ఆ సమయంలో అతగాడికేసి చూస్తే అభిమానం 'ఫీ'లవుతాడేమోనని 'చూడకూడదు' అనుకున్న శ్యామల, అనుకున్నట్లుగా వుండలేక, చటుక్కున అతనికేసి చూసింది. కాని, తను ఊహించినట్లుగాలేడు. మామూలుగానే వున్నాడు.

ఎప్పటిలా అతని కళ్ళు నవ్వుతూనే వున్నాయి.

ఇతగాడికి పౌరుషాభిమానాలంటూ లేవా? రోజూ ఎంతో కొంత 'లేటు'గా రావటం, చీవాట్లు తినటం అతనికి అలవాటయిపోయింది. బస్సులు వేళకు రావు కాబోలు! లేకుంటే రోజూ అన్ని అష్టకాలు తిని ఎవరూ సహించలేరు. కొంచెం 'వీక్'గా కనిపిస్తే ఎవరికైనా అలుసుగానే వుంటుందేమో!

శ్యామ్‌సుందర్ అంటే కథల్లోనాయకుడిలా, సినిమాలో హీరోలా వుండడు. సన్నగా పొడవుగా, చామనఛాయకంటే మరికొంచెం రంగులోవుంటాడు. అతని కళ్ళెపుడూ నిర్మలత్వానికి నిలయంగా నవ్వుతూ వుంటాయి. ఎప్పుడూ తెలుపు బట్టలే వేసుకుంటాడు. ఎవరితోనూ మాట్లాడడు నోరారా! అతనిలో ప్రత్యేకమైన ఆకర్షణ ఆ నవ్వే కళ్ళు.

ఆఫీసు అయ్యాక శ్యామల బస్సు 'స్టాపు'లో వుంది. 'స్టాపు'లో కూడా అతన్ని గురించే మళ్ళా ఆలోచనలు. అతను ఏనెంబరు బస్సు ఎక్కుతాడో? ఒకటి రెండుసార్లు నెంబరు టెన్ ఎక్కటం చూసింది. అదయితే బీచి రోడ్డుమీదుగా 'అప్‌లాండ్సు' వెళతుంది. బహుశ అతను కృష్ణానగర్‌లో వుండి వుండవచ్చు. ఏమో? అతను ఏపనిమీద వెళ్ళతున్నాడో? తన ఆలోచనలకు తానే నవ్వుకుంది. ఇంతలో పదమూడు రావటంతో ఆలోచనల నుండి తేరుకుని తన బస్సులో జొరబడింది శ్యామల.

ఆ రోజు ఆదివారం. సెలవు. శ్యామల 'కలక్టరేటు' వద్ద దిగి బీచి వైపుగా దారితీసింది. నడచి నడచి మనుషులకు దూరంగాపోయి కూర్చుంది. ఆకాశంలో వెదురుమదురుగా మబ్బులు కమ్మి వున్నాయి అప్పటికే. గాలి విసురుగా వీస్తోంది మధ్య మధ్య. ఆ సముద్ర కెరటాలు ఉవ్వెత్తున లేచి రాతి దిబ్బల మీదనుంచి ఎగసెగసి పడుతున్నాయి. నింగీ నేలా కలిసే గీతను తదేకంగా చూస్తున్న శ్యామలను, అప్పుడే అక్కడ కొచ్చిన శ్యామ్‌సుందర్ పల్కరించాడు.

"మీరేనా? ఇంకా ఎవరో అనుకున్నాను. నాకూ మనుషులకు దూరంగా కూర్చోవటం ఇష్టం. అందుకే ఇలా వచ్చాను" అన్నాడు.

"కూర్చోండి అయితే! అనుకోకుండా కలిసేము" అంది శ్యామల. ఆఫీసులో ముఖపరిచయాలు, ఏ ఒకటి రెండు మాటలే, అదైనా ఎప్పుడైనా, తప్పించి, అంతకుమించి చనువు లేదు వారిమధ్య. శ్యామ్‌సుందర్ కూర్చున్నాక "మీరెక్కడ వుంటున్నారు?" అంది శ్యామల.

"ఇక్కడకు దగ్గరలోనే మా యిల్లు" అతను నమాధానంగా చెప్పేడు.

"అయితే మీరు అదృష్టవంతులు. బీచికి ఎప్పుడు రావాలనునుంటే అప్పుడే వచ్చేయవచ్చు. మాలా డబ్బులు ఖర్చు పెట్టుకుని బస్సులు మీద రానవసరం లేదు. డబ్బులు గురించి మాట్లాడుతున్నానని అనుకోవద్దు. ఈ రోజుల్లో ప్రతీది లెక్కపెట్టుకోవలసి వస్తోంది కదండీ!" అంది శ్యామల చిన్నగా నవ్వుతూ.

"నేనూ తరచుగా రానులెండి. మనను విశ్రాంతి కోరినపుడే వస్తూ వుంటాను" అన్నాడు శ్యామ్‌సుందర్. శ్యామలకు ఆ మాటలు విచిత్రంగా విన్పించేయి.

ఉన్నట్టుండి ఆకాశంలో మేఘాలు చిక్కబడి పోయి వాతావరణమంతా చీకటి ఆవరించింది.

"ఇక్కడకు కొంచెం దూరంలోనే మా యిల్లు. వర్షం జోరుగా వచ్చేటట్టు వుంది. వర్షం తగ్గేక వెళ్ళచ్చు. మా యింటికి రండి." ముందుగా శ్యామ్, అతని వెనక శ్యామల లేచేరు. టప టప చినుకులు పడటం మొదలు పెట్టేయి. ఇద్దరూ ఇంటికి చేరేసరికి పూర్తిగా తడిసిపోయేరు.

శ్యామ్‌సుందర్ ఉంటున్నది మేడ మీద భాగం. ముందుగా పెద్ద వరండా. ఆ వరండా ననుసరించి వరుసగా మూడు గదులు. ఆ గదులకు అవతలి వైపున బాత్‌రూంలు. ముందు గదిలో శ్యామ్‌సుందర్ మకాం. మిగతా రెండు గదులూ తాళం పెట్టబడి వున్నాయి.

శ్యామ్‌సుందర్ గదితాళం తీసి, లైటు వేసి, ఓ టవల్ తెచ్చి శ్యామలకిస్తూ వరండాలో వున్న గాడ్రెజ్ కుర్చీ చూపిస్తూ "కూర్చుని తల తుడుచుకోండి" అన్నాడు మర్యాదగా.

శ్యామల తల తుడుచుకుంటూ, గదిని పరిశీలించింది. గదిలో కిటికీ దగ్గరగా మడతమంచం. దానిమీద చుట్టబెట్టి వున్న పరుపు, టేబులు, దానిమీద చిందరవందరగా పుస్తకాలు. తీగె మీద పేంటు, షర్టులు, వగైరా. ఒక వైపున స్టవ్, అలమారాలో కాఫీ, పాల పౌడర్ టిన్ - ప్లేట్లు కప్పులు, ఓమూల స్టూలు మీద కూజా, దాని మీద బోర్లించినగ్లాసు. ఒంటరి జీవిత మని గ్రహించింది శ్యామల.

శ్యామ్‌సుందర్ బట్టలు మార్చుకుని స్టవ్ వెలిగించి పాలగిన్నె పెట్టి, బ్రూ కాఫీ తయారుచేసి, రెండు కప్పుల నిండా పోసి, ఒకటి శ్యామలకు అందించి, ఒకటి తను తీసుకుని శ్యామలకు ఎదురుగా వున్న కుర్చీలో కూర్చున్నాడు.

"మీకు శ్రమ," అంది శ్యామల.

"నేను ఎలాగూ పెట్టుకుంటాను నాతోపాటు మీరూనూ! శ్రమ ఏం లేదు"

"హొటల్ భోజనమే నన్నమాట" అంది శ్యామల మళ్ళా.

"అవునండీ! నాకు నావాళ్ళంటూ ఎవరూ లేరు. ఉన్నది ఒక్క మామయ్య, మోసేడు. ఇంకిప్పుడు నా భారాన్ని నేనే మోసుకుంటున్నాను. మామయ్యకు బరువుతగ్గించి, భోజనానికి హొటల్ బోయే, పాపం, ఎప్పుడూ ఇబ్బంది పెట్టడు, బుద్ధి పుట్టినప్పుడు తాగేందుకు మాత్రం కాఫీకి కావలసిన ఏర్పాటు చేసుకున్నాను," అన్నాడు శ్యామ్‌సుందర్. జోరున వర్షం కురుస్తూనే వుంది. లైట్లు కూడా పోయేటట్టుగా వున్నాయి.

వర్షపు జోరునే చూస్తున్న, శ్యామల "ఇంతలో వర్షం తగ్గేటట్టులేదు" అంది శ్యామల.

"ఫరవాలేదు. తగ్గిపోతుంది. తగ్గేక వెళ్ళవచ్చు. ఇంటిదగ్గర మీవాళ్ళు కంగారు పడుతూవుంటారు కాబోలు" అన్నాడు శ్యామ్‌సుందర్.

"నాకోసం అంత అదుర్దాపడేవారెవరూ లేరండి. నాకున్నది ఒక్కనాన్న. ఎప్పుడూ ఆయాసంతో, ఆస్తమాతో బాధపడుతూ వుంటాడు. తనబాధ తానే పడలేని స్థితిలో ఇంకొకరిని గురించి ఆలోచించే ఓపిక ఆయనకు లేదు. ఇలాంటి గాలి, వర్షం వచ్చిందంటే, ఈ గంటా, ఆ గంటా అన్నట్లుంటాడు," అని నిట్టూర్చి "మా చిన్నాన్న మాకింత అన్యాయం చేసి వుండక పోయినట్లయితే, నాకూ, మానాన్నకూ, ఈ అవస్థ పట్టేదికాదు. నాన్న ఉద్యోగవు ఊళ్ళో వుంటున్నపుడు, మా చిన్నాన్న మా వాటా ఆస్తి స్వాహా చేసేసేడు. ఆస్తి పోయిందనే బెంగతోనే అమ్మ మరింత కృంగిపోయి, చచ్చిపోయింది. నాన్న బెంగతో మంచం పట్టేడు. నేను నాన్న మిగిలేము. రోజల్లా ఎంత చాకిరిచేసినా, మన హెడ్‌క్లార్కు ఓంకారుగారు తిడుతూ, అవమానిస్తూనే వుంటారు. అభిమానాన్ని మరచి ఆయన దగ్గర పనిచేస్తున్నాను" అంది శ్యామల. మనసుతో మాట చెప్పుకుంటూ.

"అదేమి చిత్రమో కాని అభిమాన ధనులకు, జీవితం, పరిస్థితులు, పరీక్షగా మారుతూ వుంటాయి. శ్యామలగారూ, నా పరిస్థితి కూడా ఇంచుమించు ఇంతే! అమ్మ పోతూ పోతూ, నన్ను మామయ్య చేతిలో పెట్టింది. మామయ్య బాగా డబ్బున్నవాడు ఒకర్తే కూతురు. దానిపేరు వసంత డబ్బుగలవారి అహం, పీదవాళ్ళ పెన్నిధి అయిన అభిమానంతో ఆటలాడుతుంది. మామయ్యగారింట్లో నేను నా వ్యక్తిత్వం, అభిమానం, అనే వాటిని మర్చిపోయాను" అన్నాడు శ్యామ్‌సుందర్.

ఇద్దరి మధ్యా ఏదో తెలియని చేరువ భావం ఏర్పడినట్లుగా అన్పించింది. వర్షం జోరు తగ్గింది.

"నాన్నగారు ఎలా వున్నారో, ఏమిటో? నేనింక ఇంటికి వెళతాను" అంటూ శ్యామల లేచింది.

"ఉండండి" అంటూ శ్యామ్ సుందర్ లోపలకు వెళ్ళి టార్చిలైటు తెచ్చి ఇస్తూ, "రోడ్డు మీదకు నీరు బాగా వచ్చివుంటుంది, చీకటికూడా - తీసుకు వెళ్ళండి" అంటూ ఇచ్చేడు.

"ఇది మళ్ళా మీకు ఆఫీసులో ఇవ్వవలసి ఉంటుందేమో!". కొంచెం సంశయం తెలిబుచ్చింది శ్యామల.

"పోనీ మీరు మళ్ళా చీచికి వచ్చినపుడు ఇవ్వండి" అన్నాడు శ్యామ్ సుందర్.

శ్యామల మెట్లుదిగి వచ్చేసింది.

అది లగాయితూ వారిద్దరూ తరచుగా బీచిలో కలుసుకోవటం, ఏదో ఒకటి మాట్లాడుకుంటూ ఉండటం అలవాటు అయింది.

o o o

ఆ రోజు శ్యామలని హెడ్‌క్లార్కు ఓంకార్‌గారు తన రూంలోకి పిలిచి చెడమడా తిట్టేడు. తన ఫైలులో కాగితం

ఒకటి శ్యామల కివ్వే నంటాడు. ఇవ్వలేదంటుంది శ్యామల. ఇంకా అంతకు ముందురోజు సబ్ హెడ్ శ్రీరామమూర్తిగారివద్ద ఓగంట పర్మిషన్ తీసుకుని, తండ్రికి బాగోలేదని, హాస్పిటల్ కి తీసుకువెళ్ళాలని వెళ్ళిపోయి నందుకు తిట్టి తిట్టి పోసేడు. ఆ రోజంతా శ్యామలఅసలే అలసిపోయింది పనితో. దానికి తోడు ఓంకార్ తిట్లు అగ్నిలో ఆజ్యం పోసినట్లయింది. తను లేనప్పుడు శ్రీ రామమూర్తిగారి పర్మిషన్ తీసుకుంటే ఏంపోయింది, తిక్క కాకపోతే? వెంటనే అప్పటికప్పుడు 'రిజైన్' చేసి పారేయాలనిపించింది. కాని, అవసరం, పరిస్థితులూ తన అభిమానానికి ఎప్పుడో సమాధి కట్టేశాయి.

విరాగావుండి, మనసు బాగోక, ఇంటికి వెళ్ళాలనిపించక బీచి వైపుకు దారి తీసింది శ్యామల 'ఇప్పుడు శ్యామ్ సుందర్ వస్తే ఎంత బాగుండును' - అనుకుంది. అదో వెర్రిభ్రమ. కావా అనుకున్నవన్నీ జరిగితే, ఇంక లేనిదే ముంది? ఎందుకోగాని ఈ మధ్య అతను ఆఫీసుకు రావటం లేదు. సెలవు పెట్టేడు. ఏ కారణంగా సెలవు పెట్టేడో, ఏమో? పోనీ, ఒకసారి వెళ్ళి తెలుసుకుంటే అనుకున్న శ్యామల మళ్ళా కృష్ణానగర్ వైపు ంటను, శ్యామ్‌సుందర్ ఇంటివద్దకు ప్పంది. మెట్లు ఎక్కకుండానే గేటుదగ్గరే, ఎదురయి ఓ పది పన్నెండేళ్ళ కుర్రాడు, అడగకుండానే వివరాలు గబ గబా చెప్పేసాడు.

"శ్యామ్‌సుందర్‌గారు లేరండి. ఇక్కడ ఆయనకు తెలిసిన ప్రొఫెసరు గారింటికి వెళ్ళేరండి. పరీక్షకు వెళుతున్నారు కదండి" అంటూ అంతా తెలిసినట్లు చెప్పేస్తున్న ఆ అబ్బాయిని 'ఉద్దండుడైన భావిపౌరుడు' అనుకున్న శ్యామలకు, అంత చికాకు లోనూ చిన్న నవ్వు వచ్చింది. వెనుదిరిగి కొంచెందూరం వెళ్ళేసరికి శ్యామ్

సుందర్ ఎదురొస్తూ పలకరించేడు.

"ఇంటికి వెళ్ళిపోతున్నారా? రండి కొద్దిగా కాఫీ తాగి వెళదురుగాని," అన్నాడు చాలా అలసిపోయినట్లుగా, వాడిపోయినట్లుగా కనిపిస్తున్న శ్యామల ముఖాన్ని చూస్తూ! శ్యామల అతన్ని అనుసరించింది.

"కొద్దిరోజులుగా మీరు ఆఫీసుకు రావటం లేదు..... తెలుసుకుందామని" – తానువచ్చిన కారణం చెప్పేసింది.

శ్యామ్‌సుందర్ తాళంతీసి లోపలకు వెళ్ళి శ్యామలకు ఓ మేగ్‌జైన్ ఇచ్చి, "చూస్తూ వుండండి, ఇప్పుడే వస్తాను" అంటూ బాత్‌రూం వైపుకు వెళ్ళిపోయేడు. శ్యామల పుస్తకం తిరగేస్తూ కూర్చుంది.

శ్యామ్‌సుందర్, స్నానంచేసి, బట్టలు మార్చుకు, కాఫీకలిపి తెచ్చి శ్యామలకిస్తూ, "ఎమ్. ఎ. ఎకనమిక్స్‌కు వెళతున్నాను. పరీక్షలు దగ్గర పడుతున్నాయి కదండి, సెలవు పెట్టేను. ఆఫీసు విశేషాలు ఏమిటి?".... అన్నాడు.

దానికి శ్యామల ఆరోజు తను తిన్న తిట్లన్నీ చెప్పి, "ఇక ఆయన దగ్గర పనిచేసే ఓపికా, ఓర్పూ పోతున్నాయండి," అంది విసుగ్గా బాధగా.

"నిజమే కొన్నిగంటలు ఆయన దగ్గర పని చేయలేకపోతున్నాము. అతనిని కట్టుకున్న భార్యసంగతి ఆలోచించండి. ఈ మధ్యనే విడాకులు తీసుకుని వెళ్ళిపోయిందిట. అప్పటినుంచీ ఇతనికి చిరాకు ఎక్కువయిందిట," అన్నాడు శ్యామ్‌సుందర్.

"చాలా అదృష్టవంతురాలు. ఎవరి జీవితంలో అయినా ఒకప్పుడు కాకపోతే, ఒకప్పుడయినా అదృష్టం అనేది సంభవిస్తుంది. నా జీవితంలో నాకలాంటి రోజు ఉందనుకోను,".... అంది నిస్పృహగా శ్యామల.

'అలా నిరాశపడకండి. మరో సెక్షన్‌కు మార్చుకుందుకు ప్రయత్నించండి. కావాలంటే నేను కూడ 'హెల్ప్' చేస్తాను," అన్నాడు శ్యామ్‌సుందర్.

తర్వాత శ్యామల లేస్తూ, "మీరు కూడ ఎప్పుడయినా ఒకసారి మా యింటికి రండి," అంది శ్యామల.

"తప్పక వస్తాను. పరీక్షలు అయిపోయేక. మీ నాన్నగారికి ఎలావుంది?" అని అడిగేడు.

"బాగోలేదు. నేనుకూడ సెలవు పెట్టాలేమో అనుకుంటున్నాను," అంది మెట్లు దిగుతూ.

శ్యామ్‌సుందర్ పరీక్షలు అయిపోయేయి. సెలవుకూడా ఆరోజుతోసరి. ఒకసారి శ్యామల ఇంటికి వెళ్ళాలనిపించి, ఆమె ఇచ్చిన ఎడ్రసు ప్రకారం వాళ్ళింటికి వెళ్ళాడు.

కుక్కలు, తాగుబోతులు ఎక్కువగా విహరించే వీధి, దీపాలుకూడా లేవు, శ్యామల ఇల్లు రెండువాటాలుగా వుంది, తలుపు ఓరగావేసి వున్న కారణంగా నెమ్మదిగా తట్టాడు. గదిలో ఓమూల చిన్నబుడ్డిలైటు వెలుగుతోంది.

'శ్యామూ' ... అంటూ మొదటిసారిగా ఆప్యాయంగా పిలిచేడతను.

ఆ పిలుపు వినగానే చటుక్కున లేచి వచ్చిన శ్యామల, అతనిని చూసి తత్తరపడింది. "రండి. కూర్చోండి," అంది ఎలాగో. లోనికివచ్చి కూర్చు న్నాడు. శ్యామలని పరిశీలనగా చూసేడు. జుట్టంతా రేగిపోయి. వుంది. కళ్ళు బాగా ఉబ్బిపోయి వున్నాయి. ముఖమంతా పీక్కుపోయింది.

"మీ నాన్నగారు ?" .... శ్యామ్ సుందర్ అడిగేడు. "పోయేరు," అని చెప్పింది శ్యామల. "అరె ? .... ఎప్పుడు ? నాకు కబురయినా చెయ్య లేదేం ?" నమ్మలేనట్లుగా ఆశ్చర్య పోతూ అడిగేడు.

"బాగోలేదని అప్పుడే చెప్పానుగా. ఆ తర్వాత జబ్బు ఎక్కువయింది. హాస్పిటల్‌లో జాయిన్ చేసేను-సెలవు పెట్టి, రాత్రింబవళ్ళు సేవచేసాను. ఆఖ రికి ఉన్న ఒక్కనాన్న కూడా ...." శ్యామలకు దుఃఖం ఆగలేదు - రెండు చేతుల్లో ముఖం దాచేసుకుంది.

శ్యామ్‌సుందర్ హృదయం కదిలి పోయింది. దగ్గరగా వచ్చి కూర్చుని, ఓదార్పుగా ఆమె వీపుని నిమురుతూ వుండిపోయేడు.

"ఇంతకష్టంలో వుండి, నాకు చెప్ప లేదంటే, మన పరిచయంలో, స్నేహంలో ఏదో లోపం ఉండి వున్నట్లే కదా".... అన్నాడు.

"కాదు .... కాదు .... మీ పరీ క్షలు 'డిష్టర్బు' చేయకూడదని" .... శ్యామల కళ్ళు తుడుచుకుని లేచి 'స్టవ్' వెలిగించి కాఫీ పెట్టింది.

"ఇప్పుడా మర్యాదలు ?".... "ఉదయంనుంచీ నోరు ఎండిపోతున్నా, కాఫీ పెట్టుకోలేదు. ఇన్నాళ్ళూ నాన్న కోసమనే తృప్తివుండేది - ఇప్పుడదీ లేదు."

"అంత విరక్తి పనికిరాదు. ఇటు వంటి పరిస్థితుల్లోనే ధైర్యంగా వుం డాలి. ఇక, నువు ఇక్కడ ఒంటరిగా వుండటం మంచిదికాదు. ఇన్నాళ్ళూ నాకు తెలీదు. తెలిసినమీదట ఒంట రిగా వదలను" అన్నాడు శ్యామ్ సుందర్.

శ్యామల మాట్లాడలేదు. మౌనంగా వుండిపోయింది. శ్యామ్‌సుందర్ బైటికి వెళ్ళి, ఆటో తీసుకొచ్చాడు.

* * *

"నా జీవితంలో నేను అదృష్ట వంతురాలిననే చెప్పుకొనే రోజు ఉంటుందనుకో లేదు. నిజంగా మీరు దైవ స్వరూపులు. ...."

"ఇదిగో శ్యామూ నేను దేవుణ్ణి కాను, దెయ్యాన్ని కాను. అలా పొగి డితే నాకు చాలా చిన్నతనంగా ఉం టుంది," అంటూ శ్యామలని తన గుం డెల మీదకు లాక్కున్నాడు. కాలం స్తంభించింది. అనుభూతులు నిండిన తృప్తితో నిశ్చింతగా నిద్రపోయింది శ్యామల.

* * *

కలం ముడిచి, కాగితాలు ఫైలులో పెట్టి కుర్చీలో వెనక్కువాలింది రాధ.

"మళ్ళా కథలూ కావ్యాల్లో పడ్డారే మిటి రాణిగారూ ! అయితే ఈ పూట

మాకు కొంచెం కాఫీ నీళ్ళయినా ఉంటాయో వుండవో!!" అన్నాడు కృష్ణభాస్కర్, రాధకు దగ్గరగా వచ్చి.

"అంత బాధ లేదులెండి. సీత చేత అన్నీ చేయించేను."

"నువ్వు కథలూ, కావ్యాలూ, రాస్తూ కూర్చుంటే, పాపం ఆమెకా శిక్ష!"

ఆ రాత్రి భోజనాలు అయేక, పనులు ముగించుకుని, మంచం మీదకు చేరిన తర్వాత "నీకో గుడ్ న్యూస్. చెప్పుకో చూద్దాం," అన్నాడు కృష్ణభాస్కర్.

"ఏముందిలెండి రేపు సినిమాకు వెళదామంటారు - సెలవు కదా, జీతాలు కూడా వచ్చేయి కదా" అంది రాధ మామూలుగా. "అయితే సినిమా చూట్టమే ఓ గుడ్ న్యూసన్నమాట నీకు" - అన్నాడు కృష్ణభాస్కర్.

"నాకే కాదు. నాబోటి మధ్య తరగతి ఆడవారందరికీనేమో!" అంది రాధ. రాధనోటి నుంచి లోకసత్యమేదో విన్నట్లు అయింది కృష్ణభాస్కర్‌కి - ఆర్తిగా దగ్గరకు తీసుకున్నాడు.

"ప్రమోషన్ వచ్చింది, రాధా! మనం కొంచెం పొదుపు చేసుకుంటే, కలర్ టి.వి. కొనుక్కోవచ్చు," అన్నాడు కృష్ణభాస్కర్. "మీరు కొనబోయే కలర్ టి.వి.లో నేను చూడాబోయే సినిమాలు అటుంచి, 'నా మాట ఏమిటంటుంది రాబోయే బేబి," అంది రాధ నవ్వుతూ.

"అలాగా! మరో గుడ్ న్యూసన్నమాట. అయితే నీకు రేపు తప్పక కొత్తచీర కొనిపెట్టి, హోటల్‌లో మంచిస్వీటు తినిపించి, ఫస్టుషోకి తీసుకు వెళ్ళాల్సిందే నన్నమాట! చూడు రాధా! బేబీ, అయినా, బుజ్జిగాడయినా, నాకు నీ తర్వాతనే మిగతా ప్రపంచం," అన్నాడు రాధను మరింత దగ్గరకు తీసుకుంటూ.

"కథ రాసేను. పేరు పెట్టాలి,' అంది రాధ.

"అవును, చదివేను .... మన కథే కదూ! 'మా కథ' అని పేరు పెట్టు," అన్నాడు కృష్ణభాస్కర్.

"ముగింపు అయ్యేక," అంటూ 'ముగింపు' ఆలోచిస్తూనే నిద్రలోకి జారింది రాధ. 

విప్లవాన్ని, నాగరికతను సమ్మిళితం చేసేనా పార్టీ యింకా ఉదయించ లేదు. 20వ శతాబ్దిలో జనించే ఆ ఉదయకిరణంలో ప్రపంచ ప్రభుత్వం ఏర్పడుతుంది.

  

యజమాని కంటె ఘోరం ఋణదాత. యజమాని సేవలు మాత్రమే కోరుతాడు. కాని, ఋణదాత మానమర్యాదలు హరిస్తాడు.

—విక్టర్ హ్యూగో

మీకు తెలిసిన

# ఇద్దరు మిత్రులు

## చిరంజీవి

ఆ దినం నాకింకా గుర్తుంది. మా సుజన అతితెలివైనది. ఆదివారం కనుక సుజి రెండోసారి అందించిన కాఫీ తాగి, పేపరు చదవటం మొదలు పెట్టాను. వంటింట్లో సుజన పడుతున్న హడావిడి కనిపిస్తూనే వుంది. త్వరగా వంట ముగించి సినిమాకి బయలుదేరాలని ఆమె కోరిక. నాకైతే కమ్మని భోజనంచేసి హాయిగా కావలసినంత సేపు నిద్రపోవాలని! సినిమా తప్పించేయ్యాలి ఎలా అని ఆలోచిస్తుంటే ఒక చిన్న ఉపాయం తళుక్కున మెరిసింది నామదిలో. నయమే ఇప్పటికైనా వెలిగింది ట్యూబ్ లైటు అని నా తెలివికి నేనే మురిసిపోయాను.

"సుజీ! సుజీ"

"ఏమిటండీ నా పని అవనివ్వరా! మళ్లీ కాఫీ ఏమన్నా కావాలా ?"

"అబ్బేబ్బే.... ఇలారా ఒక్కసారి" అన్నమాటలకు చేతులు తుడుచుకుంటూ వచ్చింది.

"సుజీ అలా కూర్చో! నీకోవిషయం గట్టిగా చెప్పాలి"

"గట్టిగానే చెప్పండి! వంటసగంలో ఉంది".... "మీకేశవరావు ఈసారి కనిపిస్తే నేనొప్పుకోనోయి. అసలు నీ నిర్లక్ష్యం వలనే కదా! ఖర్మం జాలక మధ్యలో ఒకరోజు రాకపోయినా ప్రతిదినం ప్రత్యక్షం అవుతూనే వున్నాడు".... "బాగుంది వరస. నా చుట్టమే కాని, పాపం, మీ చుట్టం కాదన్నమాట. అయినా ఆ హిప్పీ వేషం ఏమిటండీ! టెన్తే చదువుతున్న మన బాబుకీ, మీకు తేడా లేదా ఏమిటి? నెత్తిమీద గడ్డిమోపులా వుంది ఆ హిప్పీస్టెయిలు. వయసుకు తగిన వేషం వద్దూ! పైగా నా కేశవరావుట, కేశవరావు! ఎవరైనా వింటే నవ్వుతారు! అసలే సూరిబాబు రాలేదనీ, వంట పూర్తవలేదనీ, భోజనం ఎలా వేయడం అని నేను మల్లాగుల్లా అవుతుంటే, మీకు చీమ కుట్టినట్టయినా లేదు."

"సరేలే భారతం విప్పకు. వంటింట్లో పప్పు మాడిపోతున్నట్టుంది చూడు. అన్నట్టు ఏం వండుతున్నావు ఈవేళ ?"

"అంతా సస్పెన్స్ - నే చెప్పను," అంటూ వంటింట్లోకి పరిగెత్తింది సుజన.

అసలే చిరాగ్గావున్న నాకు కాలింగ్ బెల్లు మోత వినిపించింది. తప్పదన్నట్లు

గా నేను లేచి తలుపు తీయడం మా వెంకటేశ్వర్లు లోపలికి దయచేయడం క్షణంలో జరిగిపోయింది.

"రా, రా సరిగ్గా ఆపద్బాంధవు డిలా సమయానికి వచ్చావు. అయినా వెంకటేశ్వరుడవు కదా!"

"ఏమోయి సుజీ! చూడు మీ వెంక టన్నయ్య వచ్చాడు." సుజన వంటిం ట్లోంచి వచ్చి కాస్త నవ్వు, ముఖాన్న పులుముకుని "మీరొక్కరే వచ్చేరా? వదినగార్ని కూడా తీసుకురాలేక పోయారా! ఆదివారం సరదాగా కాల క్షేపం చేద్దుము" అంది సుజన.

"అబ్బే అదేమీ లేదమ్మా, ఇలా వెడుతూ ఒక్కసారి చూచి పోదామని వచ్చేను. మీవదిన నాకోసం ఎదురు చూస్తూ వుంటుంది, వెళ్ళాలి," అని లేవబోయాడు.

"కూర్చోండి కాస్త కాఫీ తాగి వెడుదురు గాని...." లోపలికి వెళ్ళి పోయింది సుజన.

* * *

"నేనొచ్చి బెల్లు నొక్కబోతుంటే మీరేమిటో కేశవరావు, సూరిబాబు అని మీచుట్టం అంటే మీచుట్టం అని గొడవపడుతున్నారేమిటి? నీకు మా చెల్లాయితో లడాయి వేసుకుంటే కాని కాలక్షేపం కాదా!"

"సూరిబాబు అంటే మనందరి చుట్టమే. నిజానికి మన పాలిట కల్ప వృక్షము. ఒక్కరోజు రాకపోతే ఊరికే దిగులు పడుతుంది. ఒక్క రోజుకు కొంపమునిగిపోతుందా ఏమిటి చెప్పు? నాకైతే కేశవరావు ఒక్కసారి కనిపిస్తే చాలు, చాలా కంపరంగా ఉంటుంది? అసలు ఒక్కరోజు మాత్రం ఎందుకు కనిపించాలి – మీ చెల్లాయి నిర్లక్ష్యం కాకపోతే ఏమిటి మరి?"

"అసలు వారెవరో ముందరచెప్పు"

సుజన వచ్చి కాఫీ అందించింది వెంకటేశ్వర్లుకు.

"ఏమిటమ్మా! సూరిబాబనీ, కేశవ రావనీ, మీచుట్టమంటే మీ చుట్టమనీ గలాటా పడుతున్నారేమిటీ – ఇంతకీ వారెవరూ?"

ఆ మాటలు వినగానే ఫక్కుమని నవ్వింది సుజన. సుజన నవ్విందని నేను నవ్వాను.

"మీనవ్వులు ఆపి అసలు విషయం చెప్పండి ఇంక సస్పెన్స్‌తో చంపక".

"సుజా! నువ్వే చెప్పేయి"

"అబ్బా మీరే చెప్పండీ"

ఇక తప్పదన్నట్టుగా చెప్పడం మొదలుపెట్టేను. "మిత్రమా విను సూరిబాబు అంటే మన సూర్యదేవుడు. ఈవిడకి పొద్దు నియమం ఉంది. ఇంక కేశవరావు అంటే తల వెంట్రుక అన్నంలో కనిపిస్తే ఎలాగ చెప్పు?

ఈ మాటలు వింటూనే పగలబడి నవ్వేడు మా మిత్రుడు. సుజీ నేనూ కూడా శృతి కలపేము. అలా నవ్వుల పువ్వులను విరజిమ్ముతూంటే "వోరి మీ అఘాయిత్యం కూలా" అంటూ వెంకటేశ్వర్లు లేచాడు.

డైరీ

## 1985 జూన్ 4

'ఇన్నాళ్లూ దర్శకులూ సంగీత దర్శకులూ మాత్రమే మాకు పోటీగా పాత్రలు ధరిస్తూండేవారు; ఇప్పుడీ జర్నలిస్టులు కూడా మాకు పోటీగా దిగుతామంటున్నారు,' - అన్నారు నూతనప్రసాద్, కలైవాణర్‌లో జరిగిన కళాసాగర్ ఫంక్షన్‌లో! మద్రాసు తెలుగు ఫిలిమ్ జర్నలిస్ట్స్ సమర్పించిన ఈ వేడుకకు ముఖ్యఅతిధిగా విచ్చేసిన ప్రఖ్యాత దర్శకులు దాసరి నారాయణరావు, 'నాకు తెలిసినంతలో జర్నలిస్ట్స్ నైట్ జరపడం యిదే ప్రథమం. ఇన్నాళ్లూ మేము విమర్శించాం; ఇప్పుడు మీరు మమ్మల్ని విమర్శించండి - అని ప్రేక్షకులని ఉద్దేశిస్తూ వీరు యిస్తున్న ప్రదర్శనలు ఎంతో చక్కగాను, రసవంతంగాను వున్నాయి .... సహాయ దర్శకునిగా మొదటిసారి నాపేరు అచ్చులో చూసుకున్నది ఇంటూరివారి 'సినిమా'లో; షావుకార్ జానకిగారి ప్రతిభను అమెరికాలోని ఒక విశ్వవిద్యాలయం గుర్తించి డాక్టరేట్ యివ్వవలసి వచ్చింది. ఫిలిమ్ పరిశ్రమ జరుపవలసిన సత్కారాన్ని కళాసాగర్ జరుపుతున్నది. ఇదేమీ కొత్త కాదు - మన మెప్పుడూ అంతే!'- అన్నారు. ఆంధ్రా యూనివర్సిటీ డాక్టరేట్ యిచ్చిన సందర్భంగా ఇంటూరి వెంకటేశ్వరరావుకి, అరిజోనా యూనివర్శిటీ డాక్టరేట్ యిచ్చిన సందర్భంగా షావుకార్ జానకికి కళాసాగర్ వేదికపై సన్మానం జరిగింది. డా॥ శ్రీరామ్ (ఏషియన్ లాంగ్వేజెస్ బుక్ సొసైటీ) తమ సంస్థ ప్రారంభింపనున్న 'ఉదయ భారతి' (ఏడుకేంద్రాల నుంచి వెలువడే తెలుగు దినపత్రిక) గురించి చెప్పారు. ప్రత్యగాత్మ జర్నలిస్టులని అభినందించారు. అయిటమ్స్ మధ్య ఎ వి సుబ్రహ్మణ్యం మిమిక్రీ సభికులని ఆనంద పరిచింది. మురళీమోహన్, చిరంజీవి, శివకృష్ణ, మాదాల రంగారావు ఆయా రచయితలకు పాత్రధారులకు కళాసాగర్ మెమెంటోలు అందజేశారు. 'ఈ లాటరీ వ్యవస్థలో అభిరుచిని బట్టి అవకాశాలు కలగవు గనక ప్రతిభ ఎక్కడవున్నా, దానిని గుర్తించి, చేతనైన మేర సాయం చేయాలి. నిర్మాతగా నేను ఆ అవకాశం వీరికి యిస్తాను, నా సోదర నిర్మాతలుకూడా యిస్తారని ఆశిస్తున్నాను' - అన్నారు మాదాల రంగారావు, ఈ సాయం సమయాన కురిసే నవ్వుల విరిజల్లుని మెచ్చుకుంటూ! మానవ హృదయ కుహరంలోని 'ఏకాంతత'ను రాగ

వీణలా పాటిబండ్ల విజయలక్ష్మి పలికించగా, ప్రేమానుభూతి, నవచైతన్యంతో, నిత్యనూతన సోయగాలు సృష్టిస్తూ, ఎలా జీవితాన్ని పునీతం చేసేదీ చెప్పారు షాక్కార్ జానకి. 'కథ మామూలే' (పసుపులేటి రామారావు), అవతారం (శివకుమార్), ఇంటర్వ్యూ (యల్యు నారాయణరావు), మైకాసురవధ (ఈశ్వర్), సినిమాతీసి చూడు (శ్రీకృష్ణ), ముగ్గురూ ముగ్గురే (నారాయణవర్మ), తెలుగు భాషలో తెలుగు సినిమా (కిషోర్) - ఈ ప్రదర్శనలలో పాల్గొన్నవారు : జివిజి, హరనాథ్, శశిమోహన్, వెంకటేశ్వ్రరావు, నారాయణవర్మ, నారాయణరావు, శివకుమార్, పసుపులేటి రామారావు, బోసుబాబు, నరసింహం, మాస్టర్ వెంకటేశ్వర్లు మున్నగువారు. ప్రోగ్రామ్ కంపీర్ చేసిన రావికొండల రావు, ఒకనాటి లావల్‌లా (LAVAL) పేరు ఎటునుంచి చదివినా ఒకటయే జివిజి, - వీరి 'వాట్ - సెకనుల' జోక్స్ చక్కగా పేలాయి. ఆహ్వాన పత్రంలో పేర్లు ఉన్నప్పటికీ సభకు రానివారు : అతిధులలో విజయబాపినీడు ; తారలలో : సుహాసిని, అరుణ. వస్తామని చెప్పికూడా, వీరు ఎందువల్ల రాలేకపోయారో సభాముఖంగా ప్రకటన జరగలేదు. కళాసాగర్ గర్వింపదగు మరొక మణిపూస ఈ జర్నలిస్టస్ నైట్ - విమర్శకులే ప్రదర్శకులై పాఠకులతో బాటు ప్రేక్షకులని ఎలా అలరించగలరో ప్రత్యక్షంగా చూపింది - మద్రాస్ తెలుగు ఫిలిమ్ జర్నలిస్టస్ అసోసియేషన్ !

. . . . 6

1985 ఫిబ్రవరిలో భారత సోవియట్ ప్రభుత్వాల మధ్య జరిగిన సాంస్కృతిక ఒప్పందం ప్రకారం, ఉభయ దేశాలలోని కళాకారులు, సాంస్కృతిక రాయబారులుగా రెండు దేశాలమధ్య పర్యటిస్తారు. ఈ ఒప్పందం 1986 డిసెంబరాఖరు వరకు అమలులో ఉంటుంది. మొదటి సాంస్కృతిక బృందంగా (ఇరవై అయిదుగురు) బైలో రష్యా నుంచి వచ్చిన ఈ కళాకారులు, యివ్వాళ మ్యూజిక్ అకాడమీలోను, రేపు కలైవాణర్‌లోను తమ ప్రదర్శనలిస్తున్నారు. మ్యూజిక్ డాన్స్, మాజిక్, అక్రొబాటిక్స్ .... ఈ బృందం యింతవరకూ అనేక దేశాలలో పర్యటించింది. మన దేశానికి రావడం యిదే మొదటిసారి ; ఢిల్లీ, జయపూర్, త్రివేండ్రంలలో ప్రదర్శనలిచ్చి వున్నారు. ముఖ్యంగా వారి 'డప్పువాద్యం' (Drum - Beaters) భారతీయుల ప్రశంస పొందిందట .... 90 లక్షల జనాభాగల బైలో రష్యా రాష్ట్రానికి 'మింక్స్' ప్రధాన నగరం; రెండవ ప్రపంచ యుద్ధకాలంలో నాజీ దాడుల కారణంగా, ఈ రాష్ట్రమంతా నేలమట్టమయింది ; ప్రతి పదిమందికీ ఒక్కరు మాత్రమేమిగిలివున్నారక్కడ - అంత దారుణమైననష్టం; అయితే, మళ్లీకూడదీసుకున్నారు. వారి మ్యూజిక్ మూడు

విధాలు: క్లాసికల్, జానపదం, వెరైటీ వెరైటీలోనే ఎలక్ట్రానిక్ మ్యూజిక్ వుంటుంది. 'రాక్ ఒపెరా' సోవియట్ యూనియన్‌లో 1974లో ప్రారంభమయింది. ఆరువందల ఏళ్లనాటి సంగీత విద్యాలయమున్నదట. వారికి బైలో రష్యాలో .... బొల్షాయ్ థియేటర్ ట్రూప్ ఈ సెప్టెంబరులో వస్తుంది; అక్టోబరులో జిప్సీబృందం; ఆతర్వాత జాజ్ బాండ్. 1986 జనవరి 26వ తేదీన సైబీరియన్ నేషనల్ డాన్స్ ట్రూప్ వస్తున్నది; ఆతర్వాత మేనెలలో మాస్కోస్టేట్ సింఫనీ .... ఇదేవిధంగా మన దేశం నుంచి కూడా ప్రఖ్యాత కళాకారులు సంగీతకారులు సోవియట్ యూనియన్ వెళ్లనున్నారు. మొదటగా రవిశంకర్ వెళ్లన్నారు .... ఈసాంస్కృతిక ప్రదర్శలనుఇండియన్‌కౌన్సిల్ ఫర్ కల్చరల్ రిలేషన్స్‌వారూ, ఇండియాలోని సోవియట్‌యూనియన్ దౌత్య కార్యాలయంవారూ సంయుక్తంగా ఏర్పాటు చేస్తున్నారు. హొటల్ సవేరాలో మధ్యాహం జరిగిన ప్రెస్ కాన్ఫరెన్స్‌లో ఈ బృందంతో పర్యటిస్తున్న సోవియట్ యూనియన్ సాంస్కృతికశాఖ డైరక్టర్, వ్లాడిమిర్ బెన్‌యుక్ (Vladimir BENYUKH) ఈ కార్యక్రమాలు వివరిస్తూ, పత్రికల వారి సందేహాలకు సమాధానాలు చెప్పారు.

. . . 7

నెల్లూరు మండల ప్రముఖ వ్యాపారవేత్త మాగుంట సుబ్బరామరెడ్డి దంపతుల కుమార్తె సౌ॥ సుమాలినికి, ఆనం ప్రేమ్‌కుమార్ రెడ్డి (కడియం) దంపతుల కుమారుడు చి॥ శివకుమార్‌రెడ్డికి (విజయ-వాహిని నాగిరెడ్డిగారి మనుమడు), ఈ సాయింత్రం ఏడుగంటలకు విజయా శేష్ మహల్‌లో నిశ్చితార్థం జరిగింది. వీరిని ఆశీర్వదించేందుకా అన్నట్లుగా వర్షపు జల్లుతో నేల చల్లబడింది. నిశ్చితార్థమే యింతఘనంగా చేశారు. పెళ్లి ఎంత బ్రహ్మాండంగా చేస్తారో అనుకున్నారు వచ్చిన అతిథులు. మద్రాసులోని వివిధరంగాలకు చెందిన ప్రముఖులంతా అక్కడే వున్నారు. రంగుదీపాలతో, ఆతిధ్య మర్యాదలతో విజయాశేష్‌మహల్ ఒక ఇంద్రలోకంలా మారిపోయింది. వియ్యాల వారిరువురూ సంపదలో సౌజన్యంలో సాటిలేని ఉన్నతులు, ఉత్తములు.

. . . . 8

హొటల్ సవేరాలో 'ఆరుద్ర షష్టిపూర్తి ఉత్సవకమిటీ' వారిప్రధమ సమావేశం; ప్రత్యేక ఆహ్వానితునిగా పిలిచారు. ఈ కమిటీకి అధ్యక్షులు: డా॥ బెజవాడ గోపాలరెడ్డి; ఉపాధ్యక్షులు: పి ఓబుల్‌రెడ్డి. కమిటీ సభ్యులు: భుజంగస్వామి, చిత్తరంజన్, ఎంబెరుమన్నార్ చెట్టి, జితేంద్ర, కోదండరామన్, బియస్సార్‌కృష్ణ, కేశవరెడ్డి, బివియస్పెస్ మణి, మోహన్‌రావు, వుమ్మిడి నందగోపాల్, పాండురంగ, డివియస్ రాజు, రంగనాథమ్, రామకృష్ణయ్య, రామ్మోహనరావు,యమ్మెస్

రెడ్డి, ఎవికె రెడ్డి, శాంతప్ప, టివికె శాస్త్రి, వైయస్ శాస్త్రి, శివస్వామి, జెవి సోమయాజులు, పప్పు వేణుగోపాల రావు. కన్వీనర్: పివి రమణయ్యరాజా, సావనీర్ ఎడిటర్; బియస్సార్. కవిగా, గేయ రచయితగా, విమర్శకునిగా, సాహిత్య పరిశోధకునిగా, సమగ్ర ఆంధ్ర సాహిత్య చరిత్రకారునిగా ప్రఖ్యాతి నొందిన ఆరుద్రకు, వెంకటేశ్వరా యూనివర్సిటీ వారు, ఆయన అద్వితీయ కృషిని గుర్తించి డాక్టరేట్ యిచ్చారు. ఈ కమిటీవారు, ఆరుద్ర షష్టిపూర్తి సందర్భంగా, ఆయన ప్రతిభా విశేషాలు తెలిపే ఒక చక్కటి సావనీర్ వెలువరిస్తున్నారు. సెప్టెంబరు ఒకటో తేదీన మద్రాసు రాణీ సీతయ్ హాలులో ఈ ఉత్సవం జరుగుతుంది.

.... 14

ప్రతి తెలుగు సినిమాలోను ఇల్లాలికి ఒక పరీక్ష తప్పనిసరిగా ఉంటుంది గాని ఈసారి ఎ ఆర్ ఆర్ పిక్చర్సువారు తాతినేని ప్రసాద్ దర్శకత్వంలో, మొత్తం సినిమాయే 'ఇల్లాలికో పరీక్ష'గా రూపొందిస్తున్నారు. మోహన్‌బాబు ద్విపాత్రాభినయం వహిస్తున్న ఈ చిత్రంలో శారద, భానుప్రియ వున్నారు. గనక ఇద్దరూ తండ్రీ కొడుకుల భాగస్వామినులై వుండాలి. 'ముందుకొచ్చి ముద్దుపెట్టు – వెనక కొచ్చి పూలు పెట్టు - పక్కకొచ్చి వెయ్యిపట్టు - పక్కమీద చోటుపెట్టు' (వేటూరి గేయం - సుశీల, బాలసుబ్రహ్మణ్యం కంఠాలు) మోహన్‌బాబు, భానుప్రియలపై ఊటీలో చిత్రీకరించారు.... 'కాపురాని కెళ్లింది కాకినాడకి - విడాకుల కెళ్లింది విజయవాడకి - మారుమనువు కెళ్లింది మండపేటకి - ఆ పెళ్లిపెటాకులై లోకులంతా కాకులై - పొడిచి పొడిచి తరిమింది పెద్దాపురానికి' (వేటూరి పాట - అనూరాధ క్లబ్ డాన్స్ – జానకి కంఠం).... సురేష్ మహల్‌లో ప్రెస్‌మీట్ తర్వాత ఈ చిత్రంలోని కొన్ని పాటల చిత్రీకరణ చూపారు. సత్యనారాయణ, త్యాగరాజు, సారథి, టెలిఫోన్ సత్యనారాయణ మున్నగువారున్నారు. మోదుకూరి జాన్సన్ కథ; గణేశ్‌పాత్రో మాటలు. నిర్మాత: రామచంద్రరాజు. ప్రెస్ రిలేషన్స్: జగన్. ఒక్క పాట మినహా పిక్చరంతా పూర్తయినట్లే - అన్నారు దర్శకులు తాతినేని ప్రసాద్.

.... 15

విజయా డీలక్స్‌లో సుచిత్రావారి 'మాయదారి మరిది' పాటల ప్రొజక్షన్. నాలుగు పాటలూ నాలుగు ఫైట్సూ గల ఈ సస్పెన్స్ త్రిల్లర్ చిత్రంలో సుజాత, వదినగారు - సుమన్, మరిది. మహాలక్ష్మి, నాయిక. 'బుగ్గ లడిగే, ముద్దులడిగే' చిన్నికృష్ణుని పాట చిత్రీకరణలో నలభై మంది డాన్సరూ, వెయ్యిమంది జూనియర్ ఆర్టిస్టులూ పాల్గొన్నారట. పాటలు: వేటూరి; మాటలు: సత్యానంద్, సంగీతం:

చక్రవర్తి. అనూరాధ, సంయుక్త, శ్రీలక్ష్మి, సత్యనారాయణ, గిరిబాబు, సాక్షిరంగారావు, వేలు, హేమసుందర్ మున్నగువారు పాల్గొంటున్నారు. దర్శకత్వం : లీలా వరప్రసాద్. నిర్మాత : సుభాష్.

. . . . 16

మద్రాసు తెలుగు అకాడమీ వారి ఘనసన్మానం సుధామయూరికి - మానవాత్మలోని ఆశాదీపానికి సజీవ ప్రతీకగా నిలిచి, నిరాశాజీవులని నిద్ర మత్తు నుంచి లేపిన ప్రబోధ చంద్రిక సుధాచంద్రన్‌కి. పళనిస్వామి సుమధుర నాదస్వరానంతరం, యస్పి బాలసుబ్రహ్మణ్యం సభాధ్యక్షునీ, యితర ముఖ్యులనీ వేదికమీదకు ఆహ్వానించారు. ఈ 'వండర్‌గరల్'కి యిటువంటి అభినందనోత్సవం జరపడం మద్రాసు తెలుగు అకాడమీకి ఎంతో హర్షదాయకమైన విషయమన్నారు స్వాగతం తెలుపుతూ కన్వీనర్ టి వి కె శాస్త్రి. దీపారాధన గావించిన 'ఈనాడు' అధినేత, 'మయూరి' నిర్మాత రామోజీరావు, - 'ఉత్తమాభిరుచులని ప్రేక్షకులు ఆదరించరనే అపవాదు వుంది ; ఈ చిత్రానికి లభించిన ఆదరణ ప్రేక్షకులు ఎంత విజ్ఞులో చెబుతున్నది' - అన్నారు.... 'కుడికాలు పోగొట్టుకున్న ఈ అమ్మాయి, కృత్రిమకాలుతో ఎలా డాన్స్ చేస్తుందోనని, మీ దృష్టి ఎంతకీ ఆమె కాలుమీదనే ఉంటుంది. ఇంకో గంటలో మీరే చూస్తారు - ఒకటి రెండు నిముషాలలో మీ దృష్టిని, తన నాట్యంవైపు, ఆమె ఎంత అద్భుతంగా మళ్లించుకోగలదో !' అన్నారు అధ్యక్షత వహించిన అక్కినేని నాగేశ్వరరావు. ఆయన చెప్పినది అక్షరాలా కరెక్ట్ అని, కిటకిటలాడుతున్న శంకరదాస్ ఆడిటోరియమ్‌లోని ప్రేక్షకులు స్వయంగా చూసి తెలుసుకున్నారు. 'మయూరి' చిత్రంలో తనని ముగ్ధుని గావించిన ఘట్టాలు చెప్పారు ఆరుద్ర. అంగాంగములూ ప్రత్యంగములూ ఒక లయకు లోనై నర్తిస్తాయి నాట్య విద్యలో; తన అంగవైకల్యాన్ని జయించ గలిగిన ఈ సుధ, తన కళోపాసన ద్వారా ఉన్నతశిఖరాల నందుకోగలగటం తథ్యం' - అన్నారు ప్రఖ్యాత నాట్య కోవిదురాలు చిత్రావిశ్వేశ్వరన్. అలాగే పద్మాసుబ్రహ్మణ్యం. "ఈ అమ్మాయి నడకలోనే నాట్య హొయలు కనిపించాయి. టీచరునైన నేను యిలాటివి సులువుగా గుర్తించగలను ; ప్రతి మనిషీ అర్ధ నారీశ్వరుడే ; ఇంటలెక్టూ, ఇన్‌ట్యూషన్ - ఈ రెండూ కలిసే 'మేధస్సు' అవుతున్నది ; ఇన్‌టలెక్ట్ పురుషుడు - ఇన్‌ట్యూషన్ స్త్రీ. పదార్ధ చైతన్యాలలో చైతన్యాన్నే 'శక్తి' అంటున్నాం. ఆ శక్తే, ఆ సంకల్ప శక్తే, ఆ ఆత్మ శక్తే, సుధకు తన అంగవైకల్యాన్ని జయించగల సామర్థ్యాన్ని యిచ్చింది- అన్నారు. రమేష్ నాయుడు 'మయూరి' చిత్ర సంగీతం గురించీ, ఊర్వశి - శారద మళయాళ చిత్ర సీమతోగల అనుబంధం గురించీ చెప్పారు. పివి రమణయ్యరాజా అతిథుల్ని సత్కరించగా, కోనేరు లక్ష్మయ్య తమ కంపెనీ కాసెట్లు వేదిక మీద వారికి బహూకరించారు. మయూరి యూనిట్‌ని జ్ఞాపికలతో సత్కరించింది

## ముఖచిత్రం

గాంధీజీ సూత్రకారుడైతే, పట్టాభి భాష్యకారుడు. 'గాంధీ అండ్ గాంధీ యిజమ్' పేరుతో వెలువడ్డ పుస్తకం అహింసా సిద్ధాంత సారాన్ని సర్వ ప్రపంచానికీ తెలిపింది. గాంధీజీ గురించి తొమ్మిదివేల పుస్తకాలు వెలువడ్డాయంటారు. అయితే, వాటన్నిటిలోకీయిది మణిపూస. "గాంధీయిజమ్ అంటే కొన్ని సిద్ధాంతాలు, సూత్రాలు కాదు; నియమాలు, నిబంధనలు కాదు; విధి నిషేధాలుకాదు - అదొక జీవనపద్ధతి. ఇది కొత్తగా జనించినదికాదు. భారతీయుల ఆర్థిక-సాంఘిక స్వరూపంలో, వారి ప్రాచీన తత్త్వసారంలో, ఈ నేలలో, ఈ రక్తంలో, ఈ ప్రజలలో వికసించిన వినిర్మలకాంతి. అహింస అనేది ఒక సైన్సు, ఒక కళ. ఈ విద్యలో గాంధీజీ విశిష్టులు"- అన్నారు పట్టాభి. ముందుతరాల వారికోసం కాంగ్రెస్ చరిత్రను రికార్డ్ చేసి పెట్టిన మహనీయుడాయన. 'ఫెదర్స్ అండ్ స్టోన్స్' ఆయన నిశిత మేధకు నిదర్శనం. సంస్థాన ప్రజల విముక్తికి బాట ఏర్పరిచిన కార్యవాది. కాంగ్రెస్ సంస్థ శత సంవత్సరంలో, తెలుగువారిలో మొదటి కాంగ్రెస్ ప్రెసిడెంట్ (జయపూర్), మొదటి గవర్నర్ అయిన డా॥ పట్టాభిని ఒక్కసారి జ్ఞాపకం చేసుకుందాం.



అకాడమీ, సుధా చంద్రన్ తనకు జరిగిన ఈ వైభవోపేత సన్మానానికి పులకాంకితురాలై కృతజ్ఞతలు తెలిపింది; ఆమె తలిదండ్రుల ముఖాలలో ఆనందరేకలు తొణికిసలాడాయి. రావి కొండల్రావు వందన సమర్పణానంతరం, సుధాచంద్రన్ భరతనాట్యం ఒక రసానందలహరి .... సుధా మయూరిలోని దీక్షానిరతి, సంకల్పబలమూ అంగవికలులకే గాక, నేటి యువతకి మార్గదర్శకం కావాలి. 'ధీరుల్ విఘ్ననిహన్యమానులగుచున్ ధృత్యున్నతోత్సాహులై ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుమీ ప్రజ్ఞానిధుల్ గావునన్' (భర్తృహరి) .... అటువంటి ప్రజ్ఞానిధి సుధాచంద్రన్ .... లలితకళల ద్వారా దేశ సమైక్యతకి ఇతోధిక కృషి గావిస్తున్న మద్రాసు తెలుగు అకాడమీ, అకాడమీ అధ్యక్షులు ఓబుల్ రెడ్డి, కన్వీనర్ టివికె శాస్త్రి యిటువంటి అద్వితీయ కార్యక్రమం తలపెట్టినందుకు అభినందనీయులు. ముఖ్యంగా పద్మా సుబ్రహ్మణ్యం, చిత్రా విశ్వేశ్వరన్‌ల ఆశీస్సులు సుధాచంద్రన్‌కి కొండంత మనోబలాన్నియిసాయి.

'ఒకటే ఆరాటం, వాడిలో పోరాటం.... మనసే మాంగల్యం, మమతే సౌందర్యం' మురళీమోహన్, సుమలత పైన ; 'ఏ పూలపైటలో, మురిపాల తోటలో.... ఈ పూల బాటలో, నీ చూపువేటలో' శోభన్‌బాబు, సుహాసినిల పైన ; 'కందుతున్న అందమే కన్నె చెక్కిళ్లు, ముద్దు ముగ్గులెట్టినా లేత ముంగిళ్లు' - చంద్రమోహన్ తులసీల పైన, చిత్రీకరణ గావించిన వేటూరి పాటలు, చక్రవర్తి సంగీతంతో, జయభేరీ వారి 'ముగ్గురు మిత్రులు'లో మిమ్మల్ని మురిపిస్తాయి. 'మేఘాల వీణ మీటుతూ, సంధ్యారాగంలోని సరిగమలు వినడం, సౌందర్యంలోని ఘుమఘుమలు చూడటం' (శోభన్‌బాబు - సుహాసిని, మీకు వెండితెరపై కనిపిస్తుంది. ఇవేగాక, సంబరాల సంకురాత్రి, అరవై ఏళ్ల వసంతం వున్నాయి. మొత్తం ఆరు పాటలు. ముగ్గురుమిత్రులెవరో మీకు తెలుస్తూనే వుంది. సురేష్ మహల్‌లో ఈ పాటల చిత్రీకరణ పత్రికలవారికి చూపించి, యిది తమ మొదటి భారీ చిత్రమన్నారు మురళీమోహన్ ఆ తర్వాత 'వోల్డ్ పెర్సన్స్ హెూమ్' (వృద్ధుల విశ్రాంతి మందిరం) గురించిన ప్రస్తావన జరిగింది. కులమతాతీతంగా అటువంటి దొకటి ప్రజా సహకారంతో స్థాపించాలని, మురళీమోహన్ ప్రయత్నం.

## 20

"మీ నటన బావుంది గాని నడక 'స్టిఫ్'గా ఉంది ; వాచకంలో 'ఈజ్' లేదు," - అని వ్రాశారొక అభిమాని కాకినాడ నుంచి. చాలా సంవత్సరాల క్రితం. కాకినాడ వెళ్ళినప్పుడు పరిషత్తులకు ఆయనని చూశాను - చూశాను. ఆ తర్వాత కొన్నాళ్లకు ఆయనే మద్రాసు వచ్చారు ; మా యింటికొచ్చారు ; జర్నలిజమ్‌లోను, సినీఫీల్డ్‌లోను ప్రవేశించినట్టు చెప్పారు.... ఆయనే ఈ ఇమంది రామారావు," - అన్నారు ముఖ్యఅతిధి మురళీమోహన్, సుగుణా పిక్చర్స్ ప్రారంభోత్సవ సందర్భంగా! పశ్చిమ గోదావరి జిల్లా మార్టేరులోని థియేటర్ వోనర్ ఈ చిత్ర నిర్మాత భాస్కరరెడ్డి. ఇమంది రామారావు ప్రథమ దర్శకత్వ చిత్రం యోగప్రియా వారి (నిర్మాత: రమణయ్యానాయుడు.... ఫైనాన్షియర్ : పోలా రామయ్యశెట్టి) 'ముద్దుల చెల్లెలు'. ఆ చిత్రాన్ని సమీక్షిస్తూ యిలా చెప్పాము: 'ఈచిత్రానికి జీవమిచ్చినది రంగనాథ్, ప్రేమ కురిపించినది తులసి.... మహదేవన్ మ్యూజిక్ బావుంది. యువదర్శకులు ఇమంది రామారావు ప్రథమ ప్రయత్నంగా ప్రశంసనీయంగా ఉంది. నాటకీయత, కథాబలం అంతగా లేకపోయినా, జనావళికి నచ్చే పద్ధతిలో నడిచింది ఈచిత్రం'-('జగతి' -346) ద్వితీయ చిత్రానికింకా పేరుపెట్టినట్టు లేదు. మురళీమోహన్ కిందులో 'చైతన్యమూర్తికి అగ్నిపరీక్ష' లాటి పాత్ర అంటున్నారు. సుధాకర్, అన్నపూర్ణ, వై విజయ, సత్తివేలు, కల్పనారాయ్, చిట్టిబాబు, మున్నగువారున్నారు. ఆత్రేయ సాహిత్యానికి మహదేవన్ సంగీతం.... పత్రికలెంతకీ వంతెనల్లాటివి; ఆదర నిరాదరణలు ప్రేక్షకు

లవి. మురళీమోహన్ చెప్పినట్లు, మనం చేయదగ్గదెంతకీ చిత్తశుద్ధితో కూడిన కృషి ; ఫలితమంటారూ, అది మన చేతుల్లో లేదు.... నిర్మాత భాస్కరరెడ్డి పాత్రికేయులకు తమ చిరుకానుకగా 'గుడ్‌లక్ ప్లేట్స్' ఇచ్చారు. ఆ 'గుడ్‌లక్' వారిని వరించాలని అభిలషిస్తున్నాం.

## 21

"1947 ఆగస్టు 15వ తేదీనాటి దేశాభిమానం నేడు మన ప్రజలలో వున్నదా అంటే, చాలామంది సందేహం వెలిబుచ్చుతున్నారు ఈ 38 ఏళ్ళలో ఆ దేశాభిమానం ఏమయింది? న్యాయము, భద్రత గురించిన విలువలు ఏమయాయి ? విద్యాప్రమాణాలు ఎందువల్ల దిగజారి పోయాయి? .... 1937లో గాంధీజీ కాంగ్రెస్ మంత్రులకి నెలకు అయిదువందలు చాలు - అన్నారు. ఆ అయిదువందలూ ఈనాడు ద్రవ్యోల్బణ కారణంగా ఎంతకి సమానం ? రూపాయి విలువలో, 130 రెట్లు తేడా వున్నదీ అంటే అరవై అయిదు వేలుకదా - అక్షరాలా అంతగాక పోయినా విలువలలో ఎంతో మార్పు కనిపిస్తున్నది .... వెనకబడ్డ కులాలనీ తరగతులనీ లేవనెత్తేందుకు రిజర్వేషనులు కొంతమేర వుండవలసిందే గాని అందుకోసం విద్యా ప్రమాణాలని చేతులారా ధ్వంసం చేసుకోకూడదు. స్వాతంత్ర్యానికి పూర్వం విదేశాలలో చదువుకున్నవారు, స్వదేశానికి తిరిగి వచ్చేవారు. స్వాతంత్ర్యానంతరం కూడా కొన్నాళ్ళపాటు అలాగే వచ్చారు. ఇప్పుడు ఎందుకని రావటం లేదు ? మనదేశంలో అవకాశాలు తక్కువవుతున్నాయి - రాజకీయాల వొత్తిడి ఎక్కువవుతున్నది. అన్నిటా రాజకీయమే ! పార్టీయే తప్ప ప్రజామోదం అక్కర్లేదు - మందలని పోగుచేయడం ముఖ్యం. 'మంద' ఏనాటికీ 'ప్రజ' కాలేదు. ముఖ్యంగా మధ్యతరగతిని నలిపేస్తున్నారు. ఏ ప్రజాభ్యుదయానికైనా మధ్య తరగతే వెన్నెముక. మనదేశంలో వీరినోళ్లు కట్టేశారు .... మొదట అస్సామ్, ఆ తర్వాత పంజాబ్, ఇప్పుడు గుజరాత్. ఈ ఆందోళనలు అగ్ని ప్రమాదాల్లాటివి - మంటలార్పేయవచ్చు. కాని నష్టం తప్పదు ; అగ్నిశిఖలు ఎలా వురుకుతాయో చెప్పలేము .... అది నుంచీ మనదేశ బలహీనత అంతర్గత వైరాల వల్లనే .... ఒకప్పుడు ఏ ఊళ్లోకి వెళ్ళినా అందమైన కట్టడం హైస్కూలు బిల్డింగ్ అయివుండేది. ఇప్పుడు ? సినిమాహాలు ! ఈ ఒక్కటీ చాలు మన విలువల పతనాన్ని సూచించేందుకు ! శాంతి భద్రతల పట్ల, న్యాయరక్షణ పట్ల (రూల్ ఆఫ్ లా) గౌరవం ఏర్పడితే తప్ప, ఈ అనిశ్చిత వాతావరణం నుంచి విముక్తి లేదు. అలజడులను అదుపులో పెట్టగలిగేది దేశాభిమానం ఒక్కటే !" - అన్నారు మద్రాస్ ప్రెస్ క్లబ్‌లో, ఐఐటి మాజీ డైరక్టరూ ప్లానింగ్ కమిషన్ సలహాదారులు అయిన ప్రొఫెసర్ పివి ఇందిరేశన్ (ఇంద్రసేన్). ప్రెస్‌క్లబ్ అధ్య

యం.ప్రభాకరరెడ్డి సమర్పించు కవితా ఆర్ట్స్



# కుటుంబ బంధం

కథ డా॥ యం.ప్రభాకరరెడ్డి | నిర్మాత శ్రీమతి సంయుక్త | స్క్రీన్‌ప్లే-దర్శకత్వం జయదేవ్

మాటలు మద్దిపట్ల సూరి పాటలు గోపి సంగీతం సత్యం కెమెరా సత్తిబాబు

క్షులు పార్థసారధి స్వాగతం తెలుపగా సెక్రటరీ శౌలి వందన సమర్పణ గావించారు

. . . . . 23

"సంవత్సరానికి ఏడువందల చిత్రాలు తయారవుతున్నాయి మన దేశంలో. అందులో మూడింట రెండు వంతులు మద్రాసునుంచి. రాసిలోనే తప్ప వాసిలో మనం ముందడుగు వేయటం లేదు; బాలారిష్టకు ఫార్ములాయేగాని సామాజిక స్థితిగతులు ప్రతిబింబితం గావడం లేదు. టెక్నీషియన్‌గా పాతిక ముప్ఫయ్యేళ్ళ బట్టి ఈ రంగంలో వుంటున్న నేను, సినీ మీడియమ్‌ని సాంఘికాభ్యుదయానికి వినియోగించుకోవడంలో మనం విఫలమయ్యామని చెప్పడానికి జంకను .... ఈ ఫిలింఫాన్స్ అసోసియేషన్, లోగడ, నా చిత్రాలు మూడింటిని ఉత్తమ చిత్రాలుగా ఎంపిక చేసినందుకు నా వినయపూర్వక కృతజ్ఞతలు" - అన్నారు ఆంధ్రా ఫిలిమ్ ఛాంబర్ అధ్యక్షులు 'విశ్వశాంతి' విశ్వేశ్వర్రావు, - మద్రాసు ఫిలిమ్ ఫాన్స్ అసోసియేషన్‌వారి 34వ వార్షిక బహుమతుల ప్రకటన సందర్భంగా, ఆయా భాషలలోని న్యాయ నిర్ణేతలను గౌరవించేందుకు 'ఊగా థియేటర్' లో ఏర్పడ్డ సభావేదికపై, "బంగారు గుడ్లు పొదిగే బాతువంటిది చిత్ర పరిశ్రమ, ఎంత డబ్బు సంపాదించామనేది కాదు. ఏమి సాధించమనేది ముఖ్యం. ప్రేక్షకులకు ఉన్నతాభిరుచులను, జనావళికి సక్రమవర్తనను నేర్పవలసిన బాధ్యత సినీపరిశ్రమ మీద వుంది. గత మేలా గడిచినప్పటికీ భవిష్యత్తు ఆశాజనకంగా ఉంటుందని ఆశిద్దాం" - అన్నారు 'ఫిలిమ్‌ఫాన్స్' అధ్యక్షులు జస్టిస్ మోహన్.... న్యాయ నిర్ణేతల సంఘాధ్యక్షులు- తమిళ చిత్రాలకు: జస్టిస్ సింగారవేలు; తెలుగు చిత్రాలకు: జస్టిస్ రామప్రసాద్‌రావు; మళయాళం: చంద్రచూడన్ ఐఎయస్; కన్నడ: యస్పిజె రాజయ్య; హిందీ: జస్టిస్ సతార్‌సయ్యద్.... 1984లో విడుదలైన 135 తెలుగు చిత్రాలలోను పన్నెండు చిత్రాలను పరిశీలించారు తెలుగు కమిటీవారు. బహుమతి పొందిన చిత్రం క్రాంతికుమార్ 'స్వాతి'- ఉత్తమ దర్శకులు: క్రాంతికుమార్; తమిళంలో అవంతీవారి 'చిరై' - ఉత్తమ దర్శకులు: కె బాలచందర్ (అచ్చమిలైఅచ్చమిలై)-భారతీరాజా (పుదుమైపెన్); మళయాళం: అళ్లకూటథిల్ త్నియె - ఉత్తమ దర్శకులు: కెజి జార్జి; కన్నడ: రోహిణీ వారి 'బంధన' ఉత్తమ దర్శకులు: రాజేంద్రసింగ్; హిందీ: బి ఆర్ ఫిలిమ్స్‌వారి అజ్‌జిఅవాజ్ – ఉత్తమ దర్శకులు: రవిచోప్రా..... . . . . ఈ బృహత్తర కార్యక్రమ సారధి, సంస్థకు వెన్నెముక వంటి ఆరెస్ కన్నయ్య: గౌరవ కార్యదర్శి. ఎందరో మహనీయులు సహకరిస్తున్నప్పటికీ, ఈయన కృషి మాత్రం గణనీయమూ, ప్రశంసాపాత్రమూను.... అడయార్ గేటు హోటల్‌లో విజయ

లక్ష్మీ ఆర్ట్ వారి 'దొంగ' శతదినోత్స వం. కోదండరామిరెడ్డి దర్శకత్వంలో చిరంజీవి - రాధ నాయకానాయికలు గా, త్రివిక్రమరావు నిర్మించిన ఈ చిత్రం పదహారు సెంటర్లలో నూరు రోజులు ఆడింది. శ్రీకాకుళం - అంజ నేయ, విజయనగరం - లీలామహల్, విశాఖపట్నం - ప్రభాత్, అనకాపల్లి - శ్రీసత్య, కాకినాడ - లక్ష్మి, రాజ మండ్రి - దురా, ఏలూరు - వెంక ట్రామా, భీమవరం - పద్మశ్రీ, తణుకు - పద్మశ్రీ, విజయవాడ - మారుతి, మచిలీపట్నం-రామ్‌శాంతి, గుంటూరు - సరస్వతి, తెనాలి - సత్యనారాయణ, చీరాల - బాలాజీ, హైదరాబాదు - బాలాజీచిత్ర, తిరుపతి - రామ్‌రాజ్ ఈ చిత్ర విజయం తెలుగు సినీ పరిశ్ర మకు ఒక కొత్త ఊపునిస్తుందనీ, తను ఒక సంవత్సరంలో ఆరు శత దినోత్సవ చిత్రాలు నిర్మిస్తే, కోదండ రామిరెడ్డి పోయిన సంవత్సరం ఏడు శతదినోత్సవ చిత్రాలు నిర్మించి రికార్డ్ బ్రేక్ చేశారనీ, కమర్షియల్ పిక్చర్స్ వున్నప్పుడే కావ్యలక్షణం గల వాటికి ఆదరణ లభిస్తుందనీ, భారీచిత్రాలు పరిశ్రమకు హానికరమనే అభిప్రాయం తానెంత మాత్రం అంగీకరించననీ అన్నారు సభాధ్యక్షులు దాసరి నారా యణరావు : ముఖ్యఅతిధి : రాఘ వేంద్రరావు. అందాలరాణి శ్రీదేవి, జ్ఞాపికలను (మెమెంటోస్) అందజేశారు. వియత్నాంవీడు సుందరం కథ చెప్పి నప్పుడే యిది తప్పక విజయవంత మవుతుందనుకున్నామ - అన్నారు కథాబలానికి ప్రాధాన్యాన్ని యిచ్చే పరుచూరి గోపాలకృష్ణ. సభా కార్య క్రమాన్ని యస్పి బాలసుబ్రహ్మణ్యం సహజ చతురోక్తులతో నిర్వహించారు. తెలుగు నటీనటులలో ముఖ్యులనేకులు పాల్గొన్న మల్టీ - స్టార్ చిత్రమిది. వక్తలలో ఒకరు చెప్పినట్టు మేమూ చూడలేదు ; అందుకని ఆ చిత్రసమీక్ష ఈ పత్రికలో వెలువడలేదు.

. . . . . 24

'పగటి దొంగ' ప్రెస్ మీట్ పామ్ గ్రోవ్‌లో. రాజేశ్వరీ ఆర్ట్ వారి ఈ 'సస్పెన్స్ - యాక్షన్' చిత్రంలో ప్రధానపాత్ర వహిస్తున్న హరిప్రసాద్ దీనిని సమర్పిస్తున్నారు. ఇందులోని 4 పాటలూ 'సాహితి' రాసినవి. సస్పెన్సే తప్ప ఫైట్సూ రక్తపాతమూ వుండ వన్నారు. హరిప్రసాద్‌తో బాటు పూర్ణిమ, సులక్షణ, రాకేష్, అనూ రాధ మున్నగువారున్నారు. కొడై కెనాల్ ప్రకృతి రామణీయతలో కని స్తాయి కథాసన్నివేశాలు. దర్శకత్వం : జయ ; మాటలు : గోపీ ; నిర్మాత : సుధాకరరాజు. 'పగలే వెన్నెల' కవి సమయం - అలాగే 'పగటి దొంగ' బాంకు దోపిడీలన్నీ పగటి వేళనే కదా - అయితే, యిందులోది అలాటిది కాదు.

. . . . . 25

'మనకెందుకులే' అనే స్తబ్దత, జడత్వం, అంటీ ముట్టని మనస్తత్వం, సంఘ విద్రోహకరచర్యలకు అవకాశ

మిస్తున్నది. అరవ వేదమనదగు నేటి మహాభారతంలో, మానభంగాల పర్వం, మనసభ్యతకు, సంస్కృతికి ఒక పెద్దసవాల్. ఆ మనస్తత్వం మారి చైతన్యం జనిస్తే తప్ప, జాతికి పురోగతి లేదనీ, ఆ స్తబ్ధతని ఎదుర్కోమని ఉద్బోధించే, ఉషాకిరణ్ వారి ఈ అరవచిత్రం పేరు 'ప్రతిఘటన'. నాలుగే పాటలు. జానకి పాడిన పాట కాసెట్లో వింటున్నప్పుడే, ద్రవీభూత మనస్కుల్ని చేసింది; రేపు తెరపై చూస్తున్నప్పుడు దృశ్య సమన్వితమై మరింకెంత కదిలిస్తుందో చెప్పలేము. జగదీష్‌బాబు పాత్రికేయులకు పామ్ గ్రోవ్‌లో స్వాగతం తెలుపగా, యువ దర్శకులు టి. కృష్ణ, విశాఖలో ఒకే షెడ్యూల్‌లో ఈచిత్రం ఎలా ముగించి నదీ చెప్పారు. అట్లూరి రామారావు చేత పాత్ర ధరింపజేయడం ఈ చిత్ర విశేషాలలో ఒకటి. ఉషాకిరణ్ వారు తెలుగు సినీజగత్తున నవయుగ వైతాళికులు.

## జులై, 1985

అతి సౌమ్యురాలు, సౌజన్యమూర్తి, పేదల పాలిట కల్పవల్లి, చిరుహాసం చెరగనీయని మృదుభాషిణి, ఆంధ్ర మహిళాసభ నర్సింగ్‌హోమ్ మూల స్తంభాలలో ఒకరూ అయిన డాక్టర్ పావనాబాయి నాయుడమ్మ ఈ సోమవారం ఉదయం, సోముని కాంతిలో కలిసిపోయారు; ఐహిక బంధవిముక్తురాలై తన భర్త వద్దకు వెళ్ళిపోయారు; బ్రతుకులో మృత్యువులో పతిని వొంటరిప్రంచటానికి ఇష్టం లేక, అనంత గగనసీమలోకి ఎగిరి పోయారు. జూన్ ఇరవై మూడు ఆదివారం నాడు, ఐరిష్ తీరాన జరిగిన ఎయిర్ ఇండియా బోయింగ్ ప్రమాదంలో, ప్రఖ్యాత సైంటిస్ట్ నాయుడమ్మ జలమరణం పొందారు. భౌతిక అవశేషాలు సముద్రజలాన్ని చేరుకున్నాయి గనక జలమరణ మన డమేగాని అది 'బ్లాస్ట్' వల్ల, వాయు పీడనవల్ల, సంభవించిన మరణం. ఆ దుర్వార్త వినగానే పావనాబాయి అచేతనురాలయారు; ఆ నిర్జీవురాలు ఈ ప్రపంచంతో గల రుణానుబంధం తీర్చుకునేందు ఏడురోజులు పట్టింది. ఎంతటి ఘనవైద్యమూ ఆమెకి ప్రాణం పోయలేక పోయింది; నగం కాలిన శరీరాన్ని పూర్తిగా కాల్చివేశాడు అగ్నిభట్టారకుడు .... 1962 ఆంధ్ర మహిళా సభ సిల్వర్‌జుబిలీ నాటి నుంచి ఈ దంపతులతో మాకు పరిచయమూ, స్నేహమూను, డాక్టర్ పావనాబాయి ఎంత క్లుప్తంగా మాట్లాడుతారో (ఈమె గైనకాలజిస్ట్ - వైద్యంలో డాక్టరు), నాయుడమ్మ అంత వచోచతురులు (ఈయన లెదర్ టెక్నాలజీలో డాక్టరు), ఏ పార్టీలో అయినా 'సెంటర్ ఆఫ్ యట్రాక్షన్' నాయుడమ్మ, ఆయన, మనిషి ఎంత పొడవో గంభీరుడో, అనుభవమంత సువిశాలమూ, సుదీర్ఘమూను దేశవిదేశాలలో ఆయన అనేకానేక గౌరవాలు పొందారు; సెంట్రల్ లెదర్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్ ఆయన

స్వయంగా పెంచి పెద్దజేసినది. వృత్తి రీత్యా సైంటిస్ట్ అయినప్పటికీ సాహిత్యం పట్ల ఎంతో ఆసక్తి గౌరవమూను. ఆయన సంభాషణలో తెలుగుపద్యాలూ సంస్కృత శ్లోకాలూ దొర్లుతూండేవి. 'జగతి'లోని 'ప్రాచీన సాహితి' ఆయనకి చాలా యిష్టం. ఈ విజ్ఞాన కోవిదునికి, ఈ సాహితీ రసజ్ఞునికి, ఈ అనుపమ ప్రతిభాశాలికి యింత తొందరగా నూరేళ్లు నిండుతాయని ఎవరూ అనుకోలేకపోయారు .... 'మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే - యతతా మపి సిద్ధానాం కశ్చి న్మాం వేత్తి తత్త్వతః' (గీత : 7 - 3)

ఆలిండియా కృష్ణంరాజు ఫాన్స్ అసోసియేషనూ, నేషనల్ ఇంటిగ్రేషన్ వెల్ఫేర్ కమిటీ సంయుక్తంగా ఈ సాయంత్రం 'హోటల్ చోళా'లో లాన్ ఏంజిలిస్‌లో జులై అయిదవ తేదీనుంచి జరుగనున్న అయిదవ నార్త్ అమెరికన్ తెలుగు కాన్ఫరెన్స్‌కి (Fifth North American Telugu Conference) వెళ్తున్న ప్రతినిధులకు వీడ్కోలు సమావేశం ఏర్పాటు చేసింది. సమావేశకర్త ప్రఖ్యాతనటులు కృష్ణంరాజు ; సభాధ్యక్షులు ఆరుద్ర, ముఖ్య అతిథి శ్రీనివాసయ్యంగార్, ఈ ప్రతినిధుల సాంస్కృతిక యాత్ర విజయవంతం కావాలని కోరారు. సాహిత్య విమర్శకులు యస్ ప్రసాదరావు గ్రంథమొకటి ఈ సందర్భంగా ఆవిష్కరింపబడటం జరిగింది. ప్రథమ ప్రతిని కృష్ణంరాజు అందుకున్నారు. ప్రతినిధి వర్గంలో ప్రఖ్యాత కవి దాశరథి, పొత్తూరి వెంకటేశ్వరరావు (ఆంధ్రప్రభ), తుర్లపాటి కుటుంబరావు (ఆంధ్ర...), జె సత్యనారాయణ (జగతి-జ్యోతి), యస్ గురుప్రసాదరావు (లెక్చరర్), అల్లూరి సీతారామరాజు (కరాటె టీచర్), రాఘవులు (ఫొటోగ్రాఫర్) మరొకరిద్దరున్నారు. గజ్జెల మల్లారెడ్డి (ఆంధ్రభూమి), ఎబికె ప్రసాద్ (ఉదయం) వెళ్లవలసివుంది. కాని, వీలుగాక వారు బయలుదేరలేదు. కృష్ణంరాజు తలపెట్టిన ఈ నినూత్న ప్రయత్నం, ముందు ముందు ఎందరికో మార్గదర్శకం అవుతుంది. ఈ చేతితో ఆర్జించిన లక్షలు ఆ చేతితో ఖర్చుపెట్టాలనే సద్వినియోగ చింతన గల సుగుణవంతులు కృష్ణంరాజు.

—యన్నార్ చందూర్

భూతకాలమనేది ఒక శిల ; కొడవలితో కోసివేయబడే పసరిక వర్తమానం; అంచేత, బెదరక నిలిచేవి గడిచిన దినాల జ్ఞాపకాలు

—యూజిని హామిలన్

సమీక్ష



## చికాగో ఫ్రీ 'అమెరికా అల్లుడు'

అమెరికాలో ఒకానొక హాస్పిటల్‌లో డాక్టరుగా వున్న రాజు (సుమన్), వృత్తి విజయంలో వివాహం ప్రతిబంధకమవుతుందని తెలిసి కూడా, ప్రేమ సాఫల్యం కోసం అంగప్రదక్షిణ చేసే మేనమామ (కాంతారావు) కూతురు రాధని (భానుప్రియ) పెళ్లి చేసుకుని, అమెరికా తీసుకువెళ్ళి కాపరం పెడతాడు. బామ్మ (సూర్యకాంతం) ఒడియాల మూట యివ్వడం దగ్గిర్నుంచి ప్రారంభమవుతుంది తెలుగు హ్యూమర్. స్కయ్ స్క్రాపర్సు, నైట్ క్లబ్బు, పార్కింగ్ ప్లేసెస్, హెలీపాడ్స్, ఎలివేటర్స్, ఫ్లయ్ వోవర్స్, యూనివర్సల్ స్టుడియోస్, నయాగరా ఫాల్స్ - వీటన్నిటినీ మనకీ రాధకీ పరిచయం చేస్తూ, బావమీద ఆమెకుగల ప్రేమ, 'పెనవేసుకు పోనివాడు ఒక పెనిమిటా' అన్నంతగా చూబుతారు. అంబులెన్స్‌లో భర్తకు భోజనం కారియర్ తీసుకు వెళ్ళడం, పార్టీకి పిలిచిన బాస్‌ని చెంపదెబ్బ కొట్టడం, రాజు ఆలస్యంగా యింటికొచ్చినప్పుడు ఆదురాతో ఆగడం చేయడం, తమ ప్రణయకేళికి ఆటంకమని హాస్పిటల్ కాల్ వినపడకుండా టెలిఫోన్ ప్లగ్ తీసేయడం (ఆ రాత్రే ఒక పేషెంట్ మరణిస్తుంది) - వీటన్నిటితో రాధకి ఒక ఎయిర్ టికెట్ కొని యిచ్చి, విమానాశ్రయంలో దిగబెట్టి వెళ్ళిపోతాడు రాజు. అంతదాకా వచ్చినవాడు, ఆమెని ఎక్కించి వెళ్ళివుంటే, యిక కథలేదు. అందుకని విమానందాకా వుండక, భాష తెలియని భార్యని, రిసెప్షన్ లవుంజ్‌లో వొదిలేసి వెళ్ళిపోతాడు. ఆమె ఆ ఫ్లయిట్ టికెట్ చించేసి, చిన్నప్పుడొక నాట్యాచార్యుని వద్ద అడుగులు వేయడం నేర్చుకునుంది గనక, భరతనాట్యం, కూచిపూడి వరసని పెర్‌ఫారమెన్స్‌ని, చికాగో, న్యూయార్క్, లాస్ ఏంజిలిస్ వంటి నగరాలలో యిచ్చేస్తూ వుంటుంది. విడిపోయే నాటికి గర్భవతి గనక, అమెరికా అప్పారావు (వాసు), బామ్మగారూ పూరగాయల బుట్టతో అమెరికా రావటం, అక్కడ బజ్జీల వ్యాపారం, రాధకు తమ ఫ్లాట్‌లోనే బామ్మగారు పురుడు పోయటం తెలుగు తెలిసిన అమెరికా అమ్మాయితో (కిమ్) ఈమె స్నేహం - వీటం తకీ రెండు మూడేళ్ళ వ్యవధి ఉందన

కోండి. అమెరికా అమ్మాయీ రాజూ బెస్ట్ ఫ్రెండ్స్ - ఆ అమ్మాయి బర్త్‌డే పార్టీలో, మహా నరకక్తిగా ప్రదర్శనిచ్చిన తన భార్యని చూస్తాడు రాజు. ఆమెని రౌడీల బారినుంచి కరాటెతో కాపాడి, వృత్తి విజయం ఎలాగూ పోయింది గనక ప్రేమ విజయం పొందుతాడు. ప్రకాశరావుగా తంబు తన పాత్రని ఉదాత్తంగా పోషించాడు. ఆ దంపతులు రాధకి ఆశ్రయమివ్వలేక పోవడంతో, కథ మలుపు తిరిగింది. వారి సంభాషణలో గాఢమైన వాస్తవికత వున్నప్పటికీ, ఈ కథా పర్యవసానం వారినుంచే పరిష్కరింపబడాలి. అలాగాక, ఫార్ములాని, కృతక హాస్యాన్ని ఎన్నుకున్నారు. సుమన్ జరిపిన రెండు ఫైట్సూ అర్థరహితమూ అసహజమూ అసందర్భమూను. భానుప్రియ చక్కగా చేసింది. సూర్యకాంతం నవ్వులలో ముంచెత్తుతుంది. చక్రవర్తి సంగీతం, వేటూరి పాటలూ, సత్యానంద్ మాటలూ చిత్రానికెంతో పుష్టి నిస్తున్నాయి. కెమెరావర్క్ గొప్పగా ఉంది. కథ : వేల్చూరి నారాయణరావు. దర్శకత్వం : వాసు. నిర్మాణత : వేమూరి ంత. నిర్మాత : రమేష్ వేమూరి.

## కౌముది పిక్చర్స్

తెలుగు సాహిత్యంలోని వీరరస గాథలలో అతిప్రసిద్ధమైనది పల్నాటి చరిత్ర ; బ్రహ్మనాయుడు, నాయకురాలు, బాలచంద్రుడు, మాంచాల - ఈ పేర్లు తెలుగుచరిత్రలో చెరగనివి. మహాభారత సంగ్రామంలోని ఉత్తరాభిమన్యులని పోలినవారు మాంచాల, బాలచంద్రుడు. 'పల్నాటి యుద్ధం' వెనకొకసారి సినిమాగా వచ్చింది - గోవిందరాజుల సుబ్బారావు, నాగేశ్వరరావు మున్నగువారు వున్నారందులో ! ఆ సన్నివేశాలు కొన్ని రసస్ఫూర్తికోసం యిందులో వాడారు. ఒకే గడ్డలో వివేకమూ సచ్చింతనతో బాటు ఆవేశమూ కక్షా ఎలా వేరువేరు ప్రవృత్తులని బట్టి పెరుగుతాయో ఈ చిత్రం చాలా చక్కగా, నేటి కాల పరిస్థితులకి అనుగుణంగా చూబుతున్నది. గడపదాటి ఆడబడుచు బయటికి వెళ్ళడం మన సంప్రదాయంలో లేదు అనే వివాదంపై జరిగిన ఘర్షణలో నాగమణి (శారద) ఆడబడుచు (అన్నపూర్ణ) భర్త మరణిస్తాడు. నాగమణి భర్త (జగ్గయ్య), తన చెల్లెలు విధవరాలైన కారణంగా సన్యసిసాడు. నాగమణి పై చదువులకి వెళ్తుంది - కలెక్టరవుతుంది; అన్నగారు నీలకంఠమ నాయుడు (సత్యనారాయణ) ఎప్పుడూ చెల్లెలు పక్షమే! నాగమణి కూతురు భవాని (రాధ) ఆ పల్లెటూళ్లో అమ్మమ్మ సంరక్షణలో, విద్యాగంధం లేక, సహజానుబంధాలకూ అనూయలకూ లోనై పెరుగుతూంటుంది ; వయసొస్తుంది. మేనత్త కూతురు కదా అని నీలకంఠమ నాయుడు కొడుకు పశుపతికి ఆమెపై మమకారం. అయినే, ఆమెకు ఢిల్లీలో చదువుకుంటున్న మేనమామ - కొడుకు కృష్ణమ

నాయడుపై (కృష్ణ) మనసు. బ్రహ్మ నాయని వంశానికి చెందిన కృష్ణమ నాయడు చెన్నకేశవ భక్తుడు; పశుపతీ వారి కుటుంబమూ శివభక్తులూ దుర్గా దేవి ఆరాధకులూను. నాగమణి పై చదువులకి ఊరి వొదిలి వెళ్లడంతో, ఆమె భర్త సంసారత్యాగం చేయడంతో ప్రాచీన శివకేశవ వైరం, ఆధునిక రూపం దాల్చి రెండు కుటుంబాల మధ్య రాకపోకలు నిల్చిపోతాయి. ఢిల్లీ నుంచి వచ్చిన కృష్ణమనాయడు, భవాని వాళ్లింటికి వెళ్లి, కలతలు చల్లార్చే ప్రయత్నంచేస్తాడు. మరదలు అల్లరిపిల్ల అనుకుంటాడే తప్ప తనని ప్రేమిస్తున్నట్టు, గ్రహించలేకపోతాడు. కలెక్టర్ నాగమణికి వీరి సంబంధం యిష్టంలేకపోయినా; కడుపున పుట్టిన కూతురు, కన్నతల్లి (సూర్యకాంతం), కట్టుకున్న మనిషి (సన్యాసం పుచ్చు కున్న భర్త) అమ్మాయికి నచ్చినవానికి యిచ్చి చేయమనడంతో, ఆడబడుచు యింటికి వెళ్లి తాంబూలం యిచ్చి వస్తుంది. అయితే, కృష్ణమనాయడు ఢిల్లీలో వుండగా సుజాత (జయసుధ) అనే అమ్మాయికి మనసూ మాటా యిచ్చి వుండటంవల్ల, తల్లి తాంబూలం పుచ్చుకున్నప్పటికీ, నిరాకరిస్తాడు; అదే క్షణాన ఢిల్లీనుంచి దిగుతుంది సుజాత. చెన్నకేశవాలయంలో సుజాతా కృష్ణ నాయడుల వివాహ ముహూర్తం వేళ, భవాని శవం అక్కడికి వస్తుంది. అది ఆత్మహత్యా, హత్యా అనే సంశయం ఉత్తరార్ధంలో పరిష్కారమవుతుంది. మళ్లీ కక్షలూ కార్పణ్యాలూ తలఎత్తు తాయి. పల్నాటిసీమలోని ప్రాచీన విగ్రహాలనీ సంపదలనీ విదేశీదొరలకు రహస్యంగా అమ్మే ప్రయత్నంలో ఉం టాడు నీలకంఠమనాయుడు; ఈ దేశ ద్రోహాన్ని నివారించేందుకై విజృం భిస్తాడు కృష్ణమనాయడు. ఉన్నతవిద్య నేర్చి పెద్ద ఉద్యోగంలో వున్నప్పటికీ సంకుచిత మనస్తత్వమూ, లక్ష్య లోపమూ వల్ల నాగమణి అవమానం పాలవుతుంది. సుమంగళిగా సుజాత మరణించగా, చట్టాన్ని తన చేతుల్లోకి తీసుకు, రక్తం చిందించిన కారణంగా ఉరికంబం ఎక్కుతాడు కృష్ణమ నాయడు. .... జడ్జీగా సియస్ రావు చూపిన గాంభీర్యమూ, రాగద్వేషాతీ తుడైన యోగిపుంగవునిలా జగ్గయ్య చూపిన సాధుత్వమూ, అహంకారమూ అధికారమూ చూపుల్లో కనబరిచిన ఊర్వశి శారద అసహాయత, చెట్లూ పుట్టలూ పట్టుకు తిరిగానేగాని నాకు విద్యాబుద్ధులు నేర్పించావా అని రాధ వేసిన ప్రశ్న, ఒక చిన్న అబద్ధంతో తప్పించుకోవచ్చుగాని వంశ ప్రతిష్ట కాపాడేందుకే నిజం చెప్పానంటూ కటకటాల వెనకనున్న మరిదికి జయ సుధ కర్తవ్యం బోధ గావించడం, తను తనది తన వాళ్ల కంటె విలువైన మహత్తర లక్ష్యాలేమిటో కృష్ణ చూప డం.... ఈ చిత్రంలో మరుపురాని ఘట్టాలనేకం వున్నాయి; కోదండరామి రెడ్డి స్క్రీన్‌ప్లే ఎంతో రసవత్తరంగా ఉంది. అయితే కృష్ణమనాయడని బండిమీద శిలువతో ఊరేగించటం, సుజాత గాజులూపువ్వులూ విషయంలో

నీలకంఠమ నాయడు మనుషుల ప్రవర్తన, పిండప్రదానం నీళ్లలో చేయటం, సుజాత జడ్జిగారిని కలుసుకు ఆ తర్వాత ఉరిపోసుకోవటం, న్యాయ విచారణ సమయంలో కలెక్టరు నాగ మణి కోర్టులో మాట్లాడటం – యిలా టివి కొన్ని తగ్గించి వుంటే, కథకు మరింత బలం చేకూరేది. గేయరచన, స్వరకల్పన, సంభాషణా చతురిమ ఈ చిత్రానికి సాహిత్య పుష్టినీ, సౌందర్య దీప్తినీ, నాటకీయవైభవాన్ని యిస్తు న్నాయి. దర్శకులు : కోదండరామి రెడ్డి. నిర్మాత : యమ్మెస్ రెడ్డి.

## విజయలక్ష్మి ఆర్ట్స్ 'దర్జా దొంగ'

హెటూరు సైకిలు పొగలోని కార్బన్ మోనాక్సయిడ్‌తో, విలన్ గారు ఒకరిని చంపడంతో ప్రారంభ మయే ఈ చిత్రంలోని రాజు (సుమన్) ఒక దర్జాదొంగ; సైకిళ్ళు ఎత్తుకు పోవడం నుంచి కార్లు అపహరించి బెంగళూరులో పది పదిహేను వేలకి సునాయసంగా అమ్మే స్థితికి ప్రమోట్ అయాడు. అలా ఒకకారు అమ్మేసి, అనూరాధ క్లబ్‌డాన్సుచూసి, ఒక సినిమాహాలులో, 'ఆరాధన' లోని యన్‌టిఆర్ వాణిశ్రీలను చూడక, పక్క సీట్లోని జయనే (విజయశాంతి) చూస్తూ ఆ ఆరాధన యిటువైపు మళ్ళించి, అం దాల సుందరికి ఆగ్రహం తెప్పిస్తాడు. ఆ 'మిస్' తన అన్నగారి కూతురు (అయిదేళ్ళది) చదువుకుంటున్న కాన్వెంట్‌లోని 'మేడమ్' అని తెలిసి మీదట, అట్టే ఆలస్యం లేకుండా ప్రణయలత అల్లుకు పోతుంది. ప్రాణ పాయస్థితిలో వున్న మిత్రుని ముప్ఫయివేలు సమకూర్చేందుకు ఈ సారి 'మారుతి' అపహరిస్తాడు. (బెంగ ళూరు దొంగ వ్యాపారి కారుకి యిచ్చేది పదిహేనువేలే; ఇది అమ్మేసి మళ్లీ మరొకటి కైంకర్యం చేదామనుకున్నా డేమో మనకి తెలీదు). కాని, ఈ కారుని దారిలో పోలీసులు అటకా యిస్తారు. రాజు దొరికిపోతాడు- మాన భంగం చేయబడ్డ వదినగారి శవంతో. అదే సస్పెన్స్. కారు అపహరిస్తున్న ప్పుడు పైనున్న లగేజి ఏమిటో అతను చూడలేదు. తను నిర్దోషినని మొత్తు కొన్నా, కోర్టువారు వినరు ; ఉరిశిక్ష విధిస్తారు. ఈకాలం సినిమాల ఖైదీ లందరి లాగానే, రాజు పోలీసుల కన్ను గప్పి తప్పించుకుంటాడు - తన నిరోషిత్వాన్ని రుజువు చేసుకునేం దుకూ, అసలు హంతకుణ్ణి పట్టుకునేం దుకూను! ప్రియురాలు జయ, మొదట్లో సందేహించినా, ఆ పైన సాయ పడుతుంది .... తన భార్య, పరాయి పురుషునితో నగ్నంగా కామకేళిలో వున్నప్పుడు చూసిన విలన్, మంగళ సూత్రాలపై రక్తం చిందేటట్లు ఆమెని గునపంతో పొడిచి చంపాడు. అప్ప ట్నుంచీ అతనికి, మంగళసూత్రాలు మెడలోగల అందమైన అతివలని అను భవించి చంపడం సరదా. నర్సుపని చేస్తున్న రాజు వొదినగారిని కూడా అలాగే చంపాడు. రాజుభార్య జయకి

(విజయశాంతి) తను ఎన్ని మంగళ సూత్రాలు సేకరించినదీ గర్వంగా చూపుతాడు; ఆమెనీ ఆ విధంగా చంపాడనే అనుకోవాలి. ఈ విలన్‌ని బానెట్‌కి కట్టి, పోలీసు స్టేషన్‌లో ఇనస్పెక్టరు (శరత్‌బాబు) ముందు పడేసి, కటకటాల వెనక్కి వెళ్తాడు హీరో. కార్ల అపహరణని గ్లామరైజ్ చేస్తూ, సహంతకుని రాక్షసోన్మాద ప్రవృత్తిని, భార్య వ్యభిచార హేతువుతో సమర్థించే ఈ చిత్రాన్ని, సెన్సారువారు ఎలా ఆమోదించారో మాకు అర్థం కావడం లేదు. కొన్ని విలువలనీ, సంప్రదాయాలనీ కించపరిచే హక్కు ఎవరికీ లేదు. పసుపుతాడు వేసుకోవచ్చు, వేసుకోకపోవచ్చు. కాని, దాన్ని ఈసడించడం, చులకన చేయడం అపచారం, నేరమూను. .... సస్పెన్స్‌తో కూడిన యాక్షన్ పిక్చర్ యిది. అంతా పరుగే! అన్నీటా వేగమే! క్లబ్‌డాన్సులూ, క్రయిమూ డబ్బు సంపాయించి పెడతాయనే నమ్మకంతో, సెంటిమెంటు కొద్దిగా చిలకరింపా రక్కడక్కడ. దర్శకులు: మణివణ్ణన్; సంగీతం: ఇళయరాజా; నిర్మాత: రామకృష్ణంరాజు.

## దుర్గా సినీచిత్ర 'మహాత్ముడు పుట్టినదేశం'

'కృష్ణస్వామి అసోసియేట్స్' వారి 'ఇండస్ వాలీ టు ఇందిరాగాంధీ' ('Indus Valley to Indira Gandhi') 1976 నవంబరులో ప్రత్యేకాహ్వానితులకు చూపారు. 'జగతి' -ఫిబ్రవరి'77 సంచికలో సమీక్షిస్తూ యిలా చెప్పాము: "పన్నెండూ పధ్నాలుగేళ్ళగా నా మదిలో మెదలుతున్న సుందరస్వప్నమిది. ఇన్నాళ్ళకు దీనికొక రూపం తీసుకురాగలిగాను' - అన్నారు కృష్ణస్వామి. ఆ రూపం తీసుకువచ్చేందుకు కృష్ణస్వామి బృందం 29 నెలల పాటు 60వేల కిలోమీటర్లు ప్రయాణం చేసి, గుజరాత్ నుంచి నాగాలాండ్ దాకా, కాశ్మీరు నుంచి కన్యాకుమారి దాకా 120 లొకేషన్స్‌లో, బాలకృష్ణన్ ద్వయం చిత్రీకరణతో, సల్‌లీ చౌధురి నేపథ్యగానంతో, శెల్వరాజ్ ఎడిటింగ్‌తో, రెండేసి గంటల చొప్పున రెండు భాగాలుగా చూసే ఈ చిత్రాన్ని నిర్మించారు. ప్రపంచ ప్రఖ్యాత సినీసంస్థ వార్నర్ బ్రదర్స్ దీని పంపిణీ చేస్తున్నారు .... చిత్ర వ్యాఖ్యాత దర్శక నిర్మాత అయిన కృష్ణస్వామి, 50 శతాబ్దుల, అనగా అయిదువేల సంవత్సరాల చరిత్ర మన దేశంలో సజీవంగా ఉన్నదని ఉద్ఘాటిస్తూ, తన భార్యనీ యింటినీ పిల్లలనీ పరిచయం చేస్తూ, తమని శాకాహారులుగా చేసిన బౌద్ధ-జైన మత ప్రభావాల వద్దకు వెళ్తారు. అలాగే అయిదువేల ఏళ్ళనాటి రాతిచక్రాల ప్రాధాన్యం చెబుతారు. మూడువేల ఏళ్ళక్రితం ఇండో ఆర్యన్ తెగలు కొలిచిన దేవుళ్ళనే ఈనాడూ మనం పూజిస్తున్నాం. బుద్ధుడు యాగాలు చేయవద్దన్నాడు; కాని, యిప్పటికీ యజ్ఞాలు జరుగుతున్నాయి .... ఇలా ఎన్నెన్నో ఒక సుగంధ పూలమాలగా కూర్చి,

భారత జాతీయ జీవనంలో పడుగు పేకల్లా అల్లుకుపోయిన అనేకానేక ప్రభావాలను చూపుతుంది విజ్ఞాన దీపిక వంటి ఈ చిత్రం"

'ఇండస్ వాలీ టు ఇందిరాగాంధి' ఆర్థికంగా అఖండ విజయం పొందింది; సాంస్కృతికంగా సర్వ ప్రపంచమూ కృష్ణస్వామిని అభినందించింది. కొండవీటి కనకదుర్గ ఈ చిత్రాన్ని యిప్పుడు 'మహాత్ముడు పుట్టినదేశం' అనే టైటిల్ తో, కొండముది శ్రీరామచంద్ర మూర్తి తెలుగు మాటలతో, ఉషశ్రీ. లక్ష్మి, మోహనరావుల కంఠాలతో సమర్పిస్తున్నారు. నిర్మాత: బసవ రాజు గోపాలకృష్ణమూర్తి. మొత్తం చిత్రాన్ని 170 నిముషాలకు కుదించారు. కొండముదివారి మాటలు, వ్యాఖ్యానదృష్ట్యా,అక్కడక్కడ కొంచెం బరువుగా వున్నా, మొత్తం మీద మాతృకకి న్యాయం చేకూర్చాయి. రేడియో కంఠాలు గాక డబ్బింగ్‌లో అనుభవం వున్నవారిని ఎన్నుకొని వుంటే బావుండేది. టైటిల్‌ని బట్టి మహాత్ముని అమరత్వంతో ముగించారు. 'ఒరిజనల్' ఉద్దేశ్యం అదికాదు; మొహంజదారో నాగరికత నుంచి, రాతి చక్రాల నుంచి, ఇండో ఆర్యన్ తెగల దేవుళ్ల నుంచి, ప్రణాళికా పథంలో భారతజాతి ప్రగతి మార్గాన పయనించడం! ఏ కారణాలవల్లో ఇందిరా గాంధీ ప్రస్తావన వొదిలేసినప్పటికీ, తెలుగు ప్రేక్షకులకు ఉత్తమ విలువలు గల ఒక చక్కటి చిత్రాన్ని సమర్పిస్తున్న దుర్గా సినీచిత్రవారు అభినందనీయులు. మీరేమిటో, మీపుట్టు పూర్వోత్తరా లేమిటో కొంచెం అలకిస్తారా? - అని అడుగుతుంది ఈ చిత్రం.

## ఝాన్సీ వారి 'కొత్త పెళ్లికూతురు'

నాట్యాచార్యుడు కుస్తీవస్తాదు అవటంలా, కాలేజీగరల్ సుజాత (విజయశాంతి) భరతనాట్యంతో బాటు కరాటె విద్యలో కూడా ప్రవీణురాలు. ఒకటి సాత్త్వికం, మరొకటి శౌర్యం. రసదృష్ట్యా రెండూ పరస్పర విరుద్ధాలైనప్పటికీ, అతి ధనవంతు లింట బుట్టిన ఒక అందాల కొలికి వాటిని ప్రదర్శిస్తున్నది గనక మనం ఆనందిస్తాం. తనూ బాహుబలంలో కొంత సమర్థుడే అయినప్పటికీ, జర్నలిస్ట్ విజయ్ (చంద్రమోహన్), ఆపదలో ఆమె చూపిన కరాటె పాటవానికి (కెమెరాట్రిక్స్ అవి-హైజంప్ రికార్డ్‌ని మానవదేహం ఏనాడూ ఎట్టి పరిస్థితుల లోను అధిగమించలేదు) విస్మయానందుడవుతాడు. ఆమె అతనితో జత కట్టి, ఈ లోకంలో ఎంత ఆకలివుందో, ఎంత దారిద్ర్యం వుందో స్వయంగా తెలుసుకు, అతనిని గాఢంగా ప్రేమిం చేస్తుంది. అతను అడిగిన ప్రకారం పేదల సహాయార్థం ఒక నాట్య ప్రదర్శన యిస్తుంది. విజయ్ ఒక ఆదర్శవాది; సంఘ ప్రక్షాళన కోసం బాల్ పాయింట్ చేతబట్టిన కలం వీరుడు. మేనమామ వీరాస్వామి (గొల్లపూడి మారుతీరావు) బ్లూఫిలిమ్‌ల వీడియో

పార్లర్' నిర్వాహకుడు. ఆయన కూతురు స్వప్న, విలన్ రాజకుమార్‌ని (రాజేంద్ర ప్రసాద్) ప్రేమించి, అతనివల్ల గర్భవతి అవుతుంది. వీరాస్వామి స్కీమింగ్ విలన్; రాజకుమార్ నిరుద్యోగ కారణంగా సినీ విలన్ అయ్యాడు. కథాప్రారంభమేమిటనగా, యుద్ధంలో గాయపడ్డ ఒక డాక్టరు (హరినాథ్), తనకి ఒక నర్సుతో సంబంధం ఉందనీ, ఆమెకు ఒక పిల్లవాడు కలిగాడనీ, ఆ తల్లీ బిడ్డా ఉన్నారనీ, వారి యోగక్షేమం కనుక్కోమనీ భార్య జానకమ్మకు (అన్నపూర్ణ) చెప్పి, కన్నుమూస్తాడు. ఆమె ద్వారపూడి వస్తుంది - భర్త కడపటి కోర్కె తీర్చే నిమిత్తం! ఆ నర్సునీ (వీరాస్వామి చెల్లెలు), పిల్లవాడినీ చూస్తుంది. తను నమ్ముకున్న మనిషి మరణించాడని తెలియగానే, అప్పటికే పక్క మీద వున్న ఆ నర్సు, ప్రాణాలు వొదులుతుంది. ఈ పిల్లవాడిని పెంచే నిమిత్తం, ఒక లక్షరూపాయిల చెక్కు (పద్దెనిమిదేళ్ళ క్రితం) అక్కడికక్కడ రాసి యిచ్చేసి, తను పట్నం వచ్చేస్తుంది. "నీ భర్తకు కలిగిన పిల్లవాడు నీ వాడు కదా ? వాడిని యిక్కడే పెంచుదాం," - అని తండ్రి (రావికొండ రావు) హితోపదేశం చేసేసరికి, మళ్లీ ద్వారపూడి వస్తారు. వీరాస్వామి అప్పటికే ఇల్లు తాళం పెట్టుకు, పట్నం వెళ్లిపోయాడు. ఆ వీరాస్వామి, మళ్ళీ జానకమ్మను, క్లయిమాక్స్ వేళ కలుసుకుంటాడు. సుజాతకి విజయ్ సోదరుడా అనే సస్పెన్స్‌తో విశ్రాంతితెర పడగా, విలన్ రాజకుమారే సోదరుడవుతాడనీ ఆ నర్సు కొడుకనీ చివరి ఘట్టాల్లో వెల్లడై, రెండు పెళ్ళిళ్ళూ ఏక ముహూర్తాన జరుగుతాయి - పశ్చాత్తాపమే పరివర్తనకు బాట అని చెబుతూ! ప్రజా నాయకుని పాత్రలో చక్కటి హ్యూమర్ వుంది. బుర్రమీద కొడితే కణతపై గాయం, కరాటె, చోరవృత్తిని నిర్భయంగా అభ్యసించే అతివ, పూర్వా పరాలు విచారించకుండా లక్షరూపాయిల చెక్కు, విజయ్ మారువేషం - యిలాటివి కొన్ని వదిలేస్తే, మొత్తం మీద పిక్చర్ నీట్‌గా వుంది; అనేక చోట్ల నవ్విస్తుంది. విజయశాంతి వెన్నెలలు చిలకరించగా, చంద్రమోహన్ చకోరమయాడు. గొల్లపూడి మారుతీరావు, రావికొండరావు తన వరవడిని కాపాడుకున్నాడు. అన్నపూర్ణ, రమాప్రభ పాత్రోచితన్యాయం చేశారు. పాటలలో సాహిత్య సుమాలు పరిమళించాయి. దర్శకులు : కెయస్ రామిరెడ్డి. నిర్మాత : శేషుబాబు.

## బాలచందర్ 'అచ్చమిల్లై...'

భారతియార్ పాటలోని 'అచ్చమిల్లై, అచ్చమిల్లై' అనగా అర్థం 'భయంలేదు, భయంలేదు' అని! భయమే అన్ని అనర్థాలకు, అన్ని వక్రమార్గాలకు హేతువవుతున్నది. ప్రకృతి వొడిలో, అటవీ భూమికి చేరువగా వున్న ఒక కుగ్రామంలోని రాణి (సరిత), విద్యాబుద్ధులుగల అలం

కారాన్ని ప్రేమించి, ఆ ప్రేమను జల ధారల పైనుంచి చందనమూ పువ్వులూతో పంపడం ద్వారా వ్యక్తబరుస్తుంది. స్వాతంత్ర్య పోరాటంలో జైలుకివెళ్ళి, చూపు పోగొట్టుకున్న ఒక సామాన్య సత్యాగ్రహ యోధుని కుమార్తె ఆమె; ప్రేమించిన యువకుడు చేనేత పరిశ్రమలో సెక్షన్ హెడ్ లాటివాడు; ఈమెకూడా ఆ చేనేత పరిశ్రమలో పగలస్తమానం అందరికి మల్లేనే పనిచేస్తూ వుంటుంది. వీరి ప్రేమ ఫలిస్తుంది - పెళ్ళవుతుంది. సుఖంగా సాగిపోతున్న ఆ గ్రామీణ జీవితంలోకి మొదట పసుపు పచ్చ కండువాలు, ఆపైన వూదారంగుకండువాలు వస్తాయి. ఊళ్లో అందరికీ గౌరవ పాత్రుడూ చదువుకున్నవాడూ అయిన అలంకారాన్ని, రెండు రంగుల వారూ తమవైపు తిప్పుకునేందుకు ప్రయత్నిస్తారు. పసుపుపచ్చ పార్టీలో జేరి యమ్మెల్యే అయి, అవతలవారు డబ్బు ఆశ చూపేసరికి, వూదారంగులోకి మారిపోతాడు అలంకారం. పెంకుటిల్లు మేడ అవుతుంది; మోటారు సైకిలు కారు అవుతుంది. ఈ అక్రమ సంపాదన హానికరమని రాణి బోధిస్తుంది; నోరుమూసుకోమంటాడు. వెనకటి మనిషికాదు ఈ బోటా నాయకుడు; మాటలు నేర్చిన నయవంచకుడు, లోకవంచకుడూను! ధన సంపాదన, అధికారతృష్ణ - ఈరెండే అతని ఊపిరి. తండ్రిని హింసిస్తాడు; భార్యని యింట్లో నుంచి పొమ్మంటాడు; ఊంపుడుకత్తెని చంపిస్తాడు; అభం శుభం తెలియని ఆడపిల్లని నీటిలోకి తోయిస్తాడు; తన దర్పం, తన స్థానం నిలబెట్టుకొనేందుకు కిరాయి రౌడీలచేత అనేక ఘాతుకాలు చేయిస్తాడు. భార్య ఒకసారి నిలవదీసి అడగ్గా,- 'సాక్ష్యమేమున్నది? నేను స్వయంగా చేయలేదుగా!'- అంటాడు. రాజకీయ చదరంగంలో అధికారపీఠ మొక్కటి తప్ప మిగతా విలువలన్నీ శూన్యం అంటాడు. రాణి సోదరుని పేరు స్వతంత్రం; మూడు వంద-రూపాయిల నోట్లతో కళ్లూ చెవులూ నోరూ మూయిస్తాడు. స్వాతంత్ర్య దినోత్సవం నాటి సభకు పెదపూలమాలతో రాణి కూడా వస్తుంది. తనబోధలు పనిచేయడం వల్ల, మనసు మార్చుకు తిరిగి కాపురం చేయడానికి వచ్చిందనుకుంటాడు. మెడలో దండ వేస్తుంది; ప్రేమగా చేతులు స్పృశిస్తుంది; నరరూప రాక్షసుడైపోయిన ఆ అలంకారాన్ని పిడికత్తితోఒక్కపోటు పొడుస్తుంది. భర్తపై హత్య లేక, హత్యా,ప్రయత్నం జరిపిన ఈ రాణిని పోలీసులు అదుపులోకి తీసుకోవడంతో చిత్రం ప్రారంభమై, ఆమెని రైలెక్కించి తీసుకుపోవడంతో ముగుస్తుంది. రాణి సోదరుడు స్వతంత్రం (మరిగుజ్జు) గాంధీ విగ్రహం వద్ద కూలబడటం సింబాలిక్. అనుపమ నటనా వైదుష్యం చూపిన సరిత కోసం ఈ పిక్చర్ చూడాలి. పటిష్టవంతమగు కథతో సరితలోని ప్రతిభను, వెలికితెచ్చి బాలచందర్ అభినందనీయులు. ఫొటోగ్రఫీ అద్భుతంగా వుంది.

కవిత

# 1857

## డా॥ బెజవాడ గోపాలరెడ్డి

---

10 మే, 1857 లో ప్రారంభమయ్యింది
తొలి స్వాతంత్ర్య సమరము.
హిందువులు ముస్లింలు కలిసి
పరదేశీయుల అత్యాచారాల ప్రతిఘటించారు.
వ్యూహము సరికానందున
అనుశాసనము తగిన మేరలో లేనందున
దేశములో ఐకమత్యము లోపించినందున
సమరము విజయాన్ని అందలేక పోయింది

నాయకత్వముకూడ బలహీనంగా ఉండిందేమో
చాలామంది ప్రాణాలు కోల్పోయారు.
కార్చిన రక్తములో స్వతంత్రబీజాలున్నాయి.
ఎత్తిన కంఠాల్లో వీరనినాదాలు రవళితమయ్యాయి.
హృదయాలు దేశభక్తి ఆవేశముతో భరితములయ్యాయి.
చీకట్లకొనలో అరుణోదయ రేఖ
అస్పష్టముగ కాన్పించింది.
కాని ఆ దినాల ఆవేశము, దేశభక్తి రక్తపాతము
నిరుపయోగము కాలేదు.
సరియగు కాలానికి నిరీక్షింపవలసి వచ్చె.

ముత్యపుచిప్పలోపడిన స్వాతిబిందువు
తోడనే ముత్యముకాలేదు.
నాటిన విత్తనము తోడనే పంటగ మారలేదు.
శిరోజాలు పెరిగి దీర్ఘవేణియగుటకు
కాలము కావాలె.
లతలు పెరిగి మొగ్గల తొడుగుటకు
పుష్పములగుటకు సమయము కావాలె.

ఎన్నో శ్రావణ ధారలు ఎన్నో పౌష్యతుహిన స్నానాలు
అభిషిక్తం చేయాలె.
వసంత సమీరాలు వింజామరల వీయాలె.
త్వరితముగ్గా అకాలమున
పువ్వులు పూస్తేలాభంలేదు.
పరాజయ ఆక్రోశాన్ని మౌనంతో
కాలాన్ని దిగమ్రింగుచు వేచి ఉండవలసి వచ్చింది.

తొంభై సంవత్సరాల దీక్షానంతరము
దేశము విముక్తిని పొందింది
మారణ యజ్ఞాలు త్యాగవ్రతాలు
పెక్కు చేయవలసి వచ్చింది
అనూహ్యమైన త్యాగప్రదర్శన చేసింది
అగ్ని గుండాలనేకములు నడచి దాటవలసి వచ్చింది
వీరోచిత త్యాగమహాకావ్యముల రచించింది.
వీరుల రక్తముతోపాటు తల్లుల కన్నీరు
దేశ క్షేత్రాన్ని చదును చేశాయి.

ఆనాడు నాటిన విత్తనము, మట్టికోటను చీల్చుకొని
రెండు రెక్కల మొలకయై పైకి తేలింది
అనాటి శంఖారావము
మారుపలికింది. దేశము నలుమూలల లోయలలో
57 సం॥ నాటి దుందుభి మ్రోతలు
అన్ని ప్రాంతాల కర్ణపుటముల చేరలేదు.
ఆనాటి అగ్నిశిఖ ఏకజిహ్వయై వెలిగింది.
1947 సం॥ నాటికి సహస్రజిహ్వలతో
దేశాన్నంతా పర్వింది.
తీరముపై దుమికిన వీచి బలాన్ని పుంజుకొని
రోదసిని నింపేఘోషలతో విలోలకల్లోలమై
ఉప్పెన బలముతో తటాల శిరాల తన్నింది.
గత శతాబ్దపు 57 ఇంజన్‌కాగా
ఈ శతాబ్దపు 47 గార్డు పెట్టి అయ్యింది
పచ్చజండాతో రైలుప్రయాణం సాగింది.
57-47 ల మధ్యకాలములో దేశం
దీర్ఘ దీక్షాసమాధిలో ఉండింది.

వివిధ రంగాలలో వివిధ ముఖాలతో సమరము సాగింది.
చిన్న చిన్న ప్రేటులుగా కాన్పించినా
విరాట్ వృక్షాన్నే పెకలించాయి.
సమరకేతువు విజయ పతాకమయ్యింది
పోరు పగ్గాలు గెలుపు తేరుల మోకులయ్యాయి.
మృతవీరుల ఆత్మలు జయస్వర్గమున
సమావేశమయ్యారు.
విజయశంఖముల మ్రోగిస్తు
మంగళాక్షతల చల్లారు.
గణతంత్ర రాజమయ్యింది
చరిత్ర ఎరుగని ఐక్యతను సాధించింది

పోయిన భాగంపోగా మిగతాది
ఒక జండా నీడలలో కుదుటపడింది
త్యాగగరిమ రాజ్యానికి వచ్చింది
ముతక వస్త్రమే రాజవేషమయ్యింది
అశోకుని ధర్మచక్రము జాతీయపతాకముపై అమరింది
త్రిముఖ సింహాము అధికార ముద్రగ తేలింది
ప్రాచీముఖమున జయతిలకము భాసించింది
వీర స్వర్గము గవాక్షముల తెరచి
జయభారతాన్ని తిలకించింది
త్యాగ దీక్షచే పునీతమయ్యింది
వీరభారతము.

నెల్లూరు, 10-5-81.



# పెండ్యాల ప్రతిధ్వని

పెండ్యాల నాగేశ్వరరావు చిత్ర సంగీతం శాశ్వత విలువలు గలది. ఆయననుసంస్మరిస్తూసంగీతోత్సవాన్ని 'పెండ్యాల ప్రతిధ్వని' పేరిట అగస్టు (85) 15వ తేదీన— స్వాతంత్ర్య దినోత్సవంనాడు, జాతీయ సమైక్యతకు చిహ్నంగా కూడా – మద్రాసులోని స్వామి శంకరదాస్ ఆడిటోరియమ్‌లో 'త్రివేణీ' సుగంధ వక్కపొడివారి సౌజన్యంతో మద్రాసు తెలుగు అకాడమీ సమర్పిస్తున్నది. పెండ్యాల సంగీత రచనలో వచ్చిన పలు పాటలను, గానంచేసి, ఆ సంగీతజ్ఞునికి నివాళులు అర్పిస్తారు.

నేడు ప్రసిద్ధ గాయనీమణులుగా యావద్భారత కీర్తి నార్జించి, తమ గంధర్వ గళాలతో నిత్యమూ అలరిస్తున్న పి. సుశీల, యస్ జానకిలను తొలిసారిగా తెలుగు చిత్రాలలో పాడించిన ఘనత పెండ్యాలదే !

ఆనాటి సంగీతోత్సవంలో పాల్గొని, తాము పాడిన పాటలను వినిపించి, పెండ్యాలకు శ్రద్ధాంజలి ఘటించాలని గాయకులు తలపోస్తున్నారు. పి.సుశీల, యస్. జానకి, యస్. పి బాలసుబ్రహ్మణ్యం, మంగళంపల్లి బాలమురళీ కృష్ణ, మాధవ పెద్దిసత్యం, యస్. రాజేశ్వరరావు, పి. లీల, యస్. వరలక్ష్మి, జమునారాణి, బి. వసంత, యస్.పి. శైలజ, విజయలక్ష్మి శర్మ సునంద, ద్వారం లక్ష్మి, లతారాణి, నారాయణ, పిఠాపురం నాగేశ్వరరావు, పి.బి. శ్రీనివాస్, జి. ఆనంద్, యమ్. రమేష్, యన్. యస్. ప్రకాశరావు, యమ్ ఎల్. నరసింహం మొదలైన గాయనీ గాయకులు నాటి ఉత్సవంలో పాల్గొని స్వరమాధురి సంగీత సహకారంతో మధురగీతాలు వినిపిస్తారు. పలువురు చిత్రసంగీత దర్శకులు కూడా ఉత్సవంలో పాల్గొంటారు.

పెండ్యాలకు సంగీత దర్శకునిగా అవకాశం ఇచ్చిన ప్రసిద్ధులు కె. యస్. ప్రకాశరావు, ఎల్. వి. ప్రసాద్, నాటి సభలో ముఖ్యులుగా పాల్గొంటారు. మహారాష్ట్ర గవర్నరు కోనా ప్రభాకరరావు, ఆచార్య ఆత్రేయ, ఆరుద్ర, మురళీమోహన్, శోభన్‌బాబు కూడా పాల్గొంటారు.

**మద్రాసు తెలుగు అకాడమీ, 25 మెలోని రోడ్, మద్రాసు-17**

# కొత్త పుస్తకాలు



న్యూ సొసైటీ మేనిఫెస్టో (The New Society Manifesto) రచన: యస్వీ భగవాన్‌దాస్. ప్రచురణ: 29 - 16 - 23, ప్రకాశం రోడ్, బకింగ్‌హామ్ పేట, విజయవాడ - 520 002. వెల: రు 4-00.

సంఘశ్రేయస్సు, వ్యక్తి జీవనవికాసం అవినాభావ సంబంధం గలవి. సంఘం బావుంటేనే మనిషి ఉన్నతుడవుతున్నాడు; ప్రగతిపథాన పయనిస్తూ తోటివారికి చేయూత నివ్వగలుగుతున్నాడు. బలవంతులు బలహీనులనీ, ధనవంతులు పేదలనీ అనాదిగా దోచుకుంటూనే వున్నారు. అనేకానేక పద్ధతులలో జరిగే ఈ 'దోపిడీ'ని అరికట్టడమూ నివారించడమూ అభ్యుదయానికి మొదటిమెట్టు. 1585 నాటి ఒక ప్రాచీనపత్రం ఇంగ్లండులోని పరిస్థితుల గురించి యిలా అన్నది: "ఎన్నో చట్టాలు వున్నాయి. కానీ, అవి అమలుకావటం లేదు. నాణ్యత లేని వస్తువులు ఉత్పత్తి అవుతున్నాయి. కల్తీలేని వస్తువు లేదు. తూకాలు సరిగా లేవు. అవినీతి రాజ్యం ఏలుతోంది .... చీకటి గుహల్లాంటి గదుల్లో కుటుంబాలు వుంటున్నాయి .... భూస్వాములు దొరికినంత భూమిని స్వాహా చేస్తున్నారు. మతం పేరుతో పకీరులూ మతాధికారులూ పేదల్ని కొల్లగొడుతున్నారు. ప్రభుత్వం దోపిడీదారులతో, ధనికవర్గంతో, భూస్వాములతో నిండివుంది." .... నాలుగు వందల సంవత్సరాల క్రితం నాటి ఈ మాటలు ఎంతో గమనార్హం. యాంత్రికంగా తప్ప మనం ఏవిధంగా ముందుకి వెళ్ళాం? 'రాజ్యాంగాన్ని ఎంత విశిష్టంగా లిఖించినప్పటికీ, 'అమలు జరిపే వారిపై వుంటుంది ఫలితం' - అని అంబేద్కర్ చెప్పిన మాటలు ఎన్నటికీ మరువ రానివి.

అశోకుని తర్వాత, బ్రిటీష్‌వారు ప్లాసీయుద్ధంలో నెగ్గి, ఆధిపత్యం సంపాదించే వరకూ భారతదేశం రాజకీయంగా అంతఃకలహాలతో నిండివుండేది. అమెరికా బ్రిటన్ నుంచి విడిపోతే, ఇండియా బ్రిటిష్‌వారి ఛత్రం కిందకి వచ్చింది. ఉపఖండంలాటి మనదేశంలో చిన్న రాష్ట్రాలా, పెద్ద రాష్ట్రాలా, ఏ విధంగా వుండటం మంచిదనే విషయంపై భగవాన్‌దాస్ తర్కించి, వికేంద్రీకరణ శ్రేయస్కరమనీ, భాషా దురభిమానాలకు లోనుగాని ఏభై చిన్నరాష్ట్రాలు పాలనా

సౌలభ్యం దృష్టిలో పెట్టుకు ఏర్పర చాలనీ, రైల్వే, విమానయానం, కరెన్సీ, విదేశాంగ విధానం, అణుశక్తి విద్య, రక్షణ, వైద్యం, నదీజలాలు, నౌకాయానం - యివీ, యిలాటివి మరి కొన్నీ, కేంద్రాధికారంలో ఉండా లన్నారు. ఎగుమతి దిగుమతుల విష యంలో రాష్ట్రాలకు స్వయం నిర్ణయా వకాశం యిస్తూ, కేంద్ర అజమాయిషీ వుండాలన్నారు. రాజధానీ నగరం ఢిల్లీ నుంచి నాగపూర్ రావాలనీ, గాంధీగారి సేవాగ్రామ్‌లా, అది దేశ మధ్యంలో ఉన్నప్పుడు, అన్ని రాష్ట్రాల వారికీ అన్ని ప్రాంతాలవారికీ అన్ని భాషల వారికీ సమైక్యతాభావం దానంతటదే ఏర్పడుతుందనీ ఈ రచ యిత సూచిస్తున్నారు. (గాంధీగారు గుజరాత్‌లోని సబర్మతీ నుంచి ఆనాటి సెంట్రల్ ప్రావిన్స్‌లోని వార్ధా కు, అంటే సేవాగ్రామ్‌కి, తన కార్య క్షేత్రం మార్చడంలోని అంతరార్ధం యిదేనని నేటి రాజకీయవేత్తలే కాదు, వెనకటి కాంగ్రెస్‌వారు కూడా మర్చి పోయారు)

నల్లధనం, కుటుంబ నియంత్రణ, న్యాయవ్యవస్థ, అవినీతి యిలాటివి చర్చిస్తూ, సిమెంటు పరిశ్రమ ప్రజ లను వెయ్యికోట్ల రూపాయిల మేరకు దోచుకున్నదనీ, ఈ దోపిడిలో అధి కారంలో వున్న పార్టీలకు భాగ స్వామ్యం వున్నదనీ అంటున్నారు ఈ రచయిత. దేశసమైక్యతకు, సుస్థిర తకు ఇంగ్లీషుని అధికారభాషగా ఒప్పుకు తీరాలనే వాదాన్ని పూర్తిగా సమర్ధిస్తున్నారు భగవాన్‌దాస్.

అధిక సంఖ్యాకులు అవిద్యలో మునిగి వుండటం నేటి రాజకీయాలకు లాభసాటి. పోలీసులు, పౌరహక్కులు, స్త్రీలహక్కులు, గ్రామీణాభివృద్ధి, నీటిపారుదల, అటవీసంరక్షణ, వాతా వరణ కాలుష్యం, నిరాయుధీకరణ యిలాటివెన్నో పరిశీలించారు. ఒక్క రిజర్వేషనుల విషయంలో ఆయన వెలిబుచ్చిన అభిప్రాయాలతో పూర్తిగా ఏకీభవించలేము తప్ప, మిగతావన్నీ మనసుని కదిలించే చక్కటి విషయాలు.

వ్యభిచారవృత్తికి రక్షణ, లైసెన్సూ యివ్వడం వల్ల సంఘపరంగా కలిగే నష్టమేమిటి? గంగా కావేరీ అను సంధానపథకాన్ని మొదట సూచించి నది అపర భగీరథుడైన సర్ ఆర్థర్ కాటన్; కేంద్రమంత్రిగా కెయల్‌రావు 1972లో ఆ పథకం విషయం కృషి చేశారు. కాటన్ కాలంలో దాని నిర్మాణవ్యయం నూరుకోట్లు; కెయల్ రావు నాటికి రు 2240 కోట్లు; ఆ తర్వాత మరొక పథకం దేశంలోని అన్ని నదులనీ కలిపేది - చర్చనీయాంశ మయింది; దానికి 50 వేల కోట్లు అవు తుందన్నారు. రెండున్నర వేల కోట్లు సాధ్యం కానిది, ఏభైవేల కోట్లు సాధ్య మవుతుందా?.... మన జాతీయ ఆదాయంలో అరవైశాతం చమురు కొనడానికీ, అన్వేషించడానికి అవు తున్నది. రచయిత భగవాన్‌దాస్ ఎన్నో అపూర్వ విషయాలు ఈ పుస్తకంలో తెలిపారు; ప్రతి ఒక్కరూ చదివి తెలుసుకోదగ్గవి —క్షీరసాగరమ్

చీకట్లో కాంతిరేఖలు. రచన: డాక్టర్ అంతటి నరసింహం; ప్రచురణ: సమతా సాహితి, 3-4-705/5, నారాయణ గూడా, హైదరాబాదు - 500029; వెల: రు. 22-00.

ఉపన్యాసాలూ, చట్టాలూ, రిజర్వేషన్లు, సానుభూతులూ, సమతా భావ ప్రదర్శలూ వేరు, వాస్తవ జీవిత సమరం వేరు. హరిజన యువకుడూ పేదవాడూ అయిన కాంతారావు చదువుకోసం, సమాజంలో ఒక స్థానం కోసం పడే ప్రయాసా, ఒడిదుడుకులూ, మానసిక కల్లోలం రచయిత హృద్యంగా చిత్రిస్తారు యీ నవలలో.

వాస్తవికతకి దగ్గిరగా సమాజంలోని అట్టడుగు వర్గాల జీవితాలకి అద్దం పట్టుతూ సాగిన కథనంలో చదివింపజేసే శక్తి కూడా వుంది. స్వాతంత్ర్య పోరాటంలో గొప్ప త్యాగాలు చేసిన చిన్న చిన్న సమిధలవైపు పాఠకుల దృష్టిని రచయిత మళ్ళిస్తారు.

తెలంగాణాలోని విముక్తివుద్యమం, రజాకార్ల దుండగాలు కూడా యీ నవలలో చోటు చేసుకున్నాయి. కొన్ని సందర్భాల్లో రచయిత పాత్రలచేత చేయిస్తున్న రాజకీయ చర్చలు ఎక్కువగా అనిపిస్తాయి.

అయితే రచయితే వుపోద్ఘాతంలో "కథాగమనానికీ అవిచ్ఛిన్న రసానుభూతికీ సాంఘికచర్చలు ఆటంకాలనే భావన రాకుండా చర్చ చేస్తాను. ఆ చర్చ కథాగమనశైలిలో భాగంగా వుండేలా శ్రద్ధ వహిస్తాను" అని చెప్పుకున్నారు.

ఈ నవలలోని ముఖ్యపాత్రలన్నీ సజీవత్వంతో నిండి మామూలు మనుష్యుల్లాగా ప్రవర్తిస్తాయి. అందుకు రచయితను అభినందించవలసిందే.

-సరోజిని ప్రేమ్‌చంద్

## ఈ మధ్య అందినవి:

అభి[illegible]న దుర్యోధన - గుమ్మెట్ల కథ. వాసిరెడ్డి సుబ్బారావు, సత్తెనపల్లి 522403. రు 3-00.

హంసలదీవి గోపాలశతకము - కాసుల పురుషోత్తమకవి. దివిసీమ సాహితీసమితి, అవనిగడ్డ - 521123. రు 2-50.

వంద చందమామలు (4) రావూరు వెంకట సత్యనారాయణరావు (భాషా కుటీరం). అరుణా బుక్ హవుస్, విజయవాడ - 2. రు. 10-00.

కౌసల్యా సుప్రజారామా (అరణ్యకాండ) - రావూరు వెంకట సత్యనారాయణరావు. అరుణా బుక్ హవుస్, విజయవాడ - 2. రు 5-00.

అక్షరాగ్ని - కవితాసంపుటి ఆచార్య తిరుమల, కిన్నెర పబ్లికేషన్స్, హైదరాబాదు -13, రు 15-00.

స్వప్నవీణ - కవిత. ఆచార్య తిరుమల. శ్రీనివాస సాహితీసమితి, హైదరాబాదు -20. రు 5-00.

పోతుకూచి కవితా సాహిత్యమ్. (సాంబశివానందలహరిపై విమర్శ) - రుద్రశ్రీ. విశ్వసాహితి, సికింద్రాబాదు. రు 5-00.



మద్రాసు తెలుగు అకాడమీ వారి ఘన సన్మానం సుధా 'మాయురి' కి 1985 జూన్ 16వ తేదీన 'శంకరదాస్' లో... చిత్రంలో: కోనేరు కాసెట్ల లక్ష్మయ్య: 'ఉషాకిరణ్' నిర్మాత 'ఈనాడు' అధినేత రామోజీరావు, అకాడమీ సారధి టి.వి.కె. శాస్త్రి, నిత్యవసంతుడు అక్కినేని, వండర్ గరల్ ఉషాచంద్రన్

గ్రామీణ ప్రజావాణి - సుంకర సత్యనారాయణ. . . శాసనమండలి ప్రసంగాలు. డా॥ యాగడ్డ లక్ష్మీ ప్రసాద్, ఆంధ్రా లయోలా కాలేజీ, విజయవాడ. రు 3-00.

విశాఖమేయరు యన్నెస్సెన్ రెడ్డి జన్మదిన సంచిక.

తెలుగు ఫిలిం డైరక్టరీ - 1985. చైతన్యపబ్లికేషన్స్, మద్రాసు - 24 రు 5-00.

'కథాంజలి' - జన్మదినసంచిక. సంపాదకులు: రాఘవాచార్య. 10 మురుగేశముదలి వీధి, మద్రాసు-79. రు 3-00.

'మయూరి' - ప్రారంభసంచిక. ఎడిటర్: డి భీమ్‌రెడ్డి. కాకతీయ పబ్లికేషన్స్, నాంపల్లి స్టేషన్ రోడ్, హైదరాబాదు - 1. కాపీ వెల : రు 2-00 సం॥ చందా రు. 111-00.

'స్టార్ అండ్ సీక్రెట్'- ప్రారంభ సంచిక. ఎడిటర్: ఎమ్ ఎ మూర్తి. కీర్తి పబ్లికేషన్స్, విజయవాడ - 2. కాపీ వెల రెండు రూపాయలు.

పూజ్యులు

# మాడపాటి

సరోజినీ ప్రేమ్‌చంద్



"A lamp can never light another lamp unless it continues to burn its own flame." విశ్వకవి రవీంద్రుని పలుకులు అవి. ఒక జ్యోతి, జ్ఞానజ్యోతి కానివ్వండి, ప్రేమ జ్యోతి కానివ్వండి లేదా కార్య దీక్ష అనే జ్యోతి కానివ్వండి, తను ప్రజ్వరిల్లుతూ వుంటేనే యింకొక దివ్వెను వెలిగించేది.

మనసా వాచా 'అహింస' ను తన వ్యక్తిత్వంలో ప్రధాన భాగంగా చేసుకున్నారు మాడపాటి హనుమంతరావు. గాంధీజీ అనుయాయులు ఎంతోమంది అహింసా సిద్ధాంతాన్ని మనస్ఫూర్తిగా విశ్వసించి ఆచరణలో పెట్టివుండవచ్చు. కాని, పంతులుగారు ప్రవర్తనలోనే కాకుండా సంభాషణలో కూడా ఎదుటివారిని నొప్పించేవారుకాదు. అహింసా సిద్ధాంతాన్ని పరిపూర్ణమైన చిత్తశుద్ధితో అనుసరించారు. కఠినంగా మాట్లాడటం ఆయనకు యిష్టం వుండేదికాదు. సాధారణంగా కార్యసాధకులైనవారు తాము చేయదలుచుకున్న మంచి పనిని కొందరికి కష్టం కలిగినా సరే. వాదులాడి, కొట్లాడి సాధిస్తూ వుంటారు. కాని, పంతులుగారు మాత్రం సౌమ్యమైన మాటలతో, ప్రవర్తనతో, తాము అనుకున్నది చేయగలిగేవారు.

ఆయనలో యీ అహింసా ప్రవృత్తి ఎంత గాఢంగా వుండేదంటే తను విశ్వసించిన వాటిని ఎదుటివారిపై బలవంతం పరిచేవారుకాదు. అయితే, ఖద్దరు ధారణ విషయంలో, స్త్రీలు బంగారాన్ని త్యజించాలనే విషయంలో మాత్రం గాంధీజీ పిలుపును అనుసరించి తన భార్యను ఒప్పించవలసివచ్చింది. ఇద్దరూ కూడా చివరివరకూ ఖద్దరు వస్త్రాలే; యింట్లో అన్నీ ఖద్దరు తువ్వాళ్ళు, కర్టెన్సే!

ఆయన జన్మించింది పంథొమ్మిదో శతాబ్దం చివరిభాగంలో - ఒక చిన్న గ్రామంలో ఆర్థికంగా సామాన్యమైన కుటుంబం. చిన్నతనంలోనే తండ్రి పోవడంతో తెలంగాణాలో మేనమామల యింట్లో పెరిగారు. వుర్దూలో విద్యాభ్యాసం. తెలంగాణా ప్రాంతం అజ్ఞానాంధకారంలో మునిగివున్న రోజులవి. పంతులుగారిలో విజ్ఞాన తృష్ణ, సంస్కరణాభిలాష, తీక్షణమైన నిజాయితీలతోపాటు స్త్రీలంటే గౌరవం, అభిమానం, సానుభూతి వుండేవి.

తమ కుటుంబంలో స్త్రీలందరినీ విద్యావంతులను చేయాలని ప్రయత్నించారు. హైద్రాబాదులో స్థాపించిన బాలికల పాఠశాలలో భార్య మాణిక్యాంబగారే మొదటి విద్యార్థిని. తన కూతురికీ అన్నగారి కోడలికీ (ఎర్రుపాలెంలో) యింట్లోనే హిందీ, సంస్కృతం, యింగ్లీషు నేర్పడానికి బాట్రాజు లక్ష్మీనరసమ్మ అనే వుపాధ్యాయినిని నియమించారు. ఆవిడ ఎర్రుపాలెం బాలికల పాఠశాలలో టీచరు. అసలు ఎర్రుపాలెంలో బాలికల పాఠశాల ఆరంభించడానికి, తమ అన్నగారిని ప్రోత్సహించింది పంతులుగారే. టీచరుని మాట్లాడటంతో తన బాధ్యత తీరిపోయిందనుకోక, ఆ ఒంటరి స్త్రీ వుండటానికి తమ యింట్లోనే వసతి, భోజనానికి ఏర్పాట్లు - యివన్నీ చేసేరు.

అప్పట్లో భర్తలను కోల్పోయిన స్త్రీలు మనోవర్తికోసం వేసే దావాలు చాలా వుండేవి. వయసులో చిన్నవాళ్ళూ, అమాయకులూ, విద్యాగంధంలేని వాళ్ళూ అయిన ఆడవాళ్ళు, మరణించిన భర్త ఎంత ఆస్తిపరుడైనప్పటికీ, తినడానికి తిండిలేక అవస్థలు పడటం చూసి, పంతులుగారు బాధపడేవారు. స్త్రీలకి ఆ రోజుల్లో ఆస్తిపై హక్కులేదు గాని మనోవర్తి పొందేందుకు వుంది. వీళ్ళని అమాయకులు చేసి దాయాదులు ఏమీ యిచ్చేవారుకాదు.

ఒక రాజమ్మగారి భర్త తహశీల్దారు చేసి చనిపోయాడు. వారికి పిల్లలు లేరు. ఇల్లూ ఆస్తీ వున్నా సంతానంలేని కారణంగా దాయాదులకు పోయింది. భర్త బతికివున్న రోజుల్లో హుందాగా బతికిన రాజమ్మగారు పెద్దతనంలో వుండటానికి నీడలేక, గుడిలో తలదాచుకునేది. వూరివారు దయతలచి పట్టెడు మెతుకులు పెట్టేవారు. అనాదరణతో అనారోగ్యంతో హతాశురాలై ఆ గుడి అరుగులమీదే మరణిస్తుంది. పేరు మార్చి రాజమ్మగారన్నాను, ఇటువంటి రాజమ్మలు అనేకమంది విషాద జీవితాలు చూసిన హనుమంతరావుగారు, స్త్రీలు విద్యావంతులై స్వయంశక్తివంతులవుతే తప్ప విమోచన లేదనే నిర్ణయానికి వచ్చి, ఆడపిల్లల విద్యావకాశాల విషయంలో ఎంతో కృషి చేశారు.

హనుమంతరావుగారు మితభాషి. మాటలు పెక్కులెందుకు, మంచి పనులు చేసి చూపాలి అనే మనస్తత్వం వారిది. ఆదర్శాలను ఒకరికి బోధించడం, సంభాషణలో వ్యక్తపరచడమూ కంటె, జీవితంలో ఆచరించి చూపడమే ఆయన ఆశయం. దైనందిన జీవితంలో ఎంతో నిరాడంబరంగా వుండేవారు. చాలా సామాన్యమూ, సాదాగానూ వుండే అలవాట్లు. పొద్దున్నే ఒకకప్పు టీ, తొమ్మిదిగంటలకు ఆకు కూరలతో భోజనం, ఒంటిగంటకు టీ, బిస్కెట్లు, మూడు గంటలకు ఒక అరటిపండు, రాత్రి భోజనంలో రెండు రొట్టెలు, మజ్జిగ - యిదే పద్ధతిలో ఆయన జీవితమంతా గడిచింది.



'కళాసాగర్' ఆహ్వానం పై విమర్శకులే ప్రదర్శకులైన సందర్భంగా (జర్న లిస్ట్స్ నైట్ – 4-6-1985) ప్రసంగిస్తున్నవారు దాసరి నారాయణరావు. కూర్చున్నవారు ; కాగడా శర్మ, యమ్మెస్ రెడ్డి, ఇంటూరి వెంకటేశ్వరరావు. ప్రత్యగాత్మ, యస్‌కెయస్ రెడ్డి, షావుకార్ జానకి.

భేషజాలూ, గొప్పలూ ఆయన ఏమాత్రం సహించేవారుకాదు. ఇంట్లో కొంత క్రమశిక్షణ విషయంలో అయ నకు పట్టుదల జాస్తి. వాడుకునే సామానులన్నీ తను ఎక్కడ పెడతారో అక్కడే వుండాలి. న్యూస్‌పేపరు, గడి యారం, చేతికర్ర, స్నానం చేసే చెంబూ, చెప్పులూ – యిట్లా ప్రతి వస్తువూ వాటి నిర్ణీతస్థానంలో వుండ వలసినదే. వాటికి ఏమాత్రం స్థాన చలనం కలిగినా అసంతృప్తి వ్యక్త పరచేవారు. అన్నిపనులూ టయిము ప్రకారం ఠంచనుగా జరిగిపోవాలి. అర్థంలేనిఆచారాలకిఇంట్లోచోటులేదు. చిన్నతనం నుండీ మూఢాచారాలంటే గిట్టేదికాదు. వరంగల్లులో వుద్యోగం చేస్తున్నరోజుల్లో సంగతి యిది. అన్ని మూఢవిశ్వాసాలతోపాటు దిష్టితీయ డం కూడా పంతులుగారికి అర్థంలేనిదే కాకుండా చాలా హాస్యాస్పదమైనదిగా అనిపించేది. తనకి తోడుగా తమ అభిప్రాయాలకు తగిన స్నేహితులను సమకూర్చుకున్నారు. వరంగల్లులో ఎవరింట్లోనైనా దిష్టితీయబోతున్నారని తెలిస్తే యీ స్నేహితులంతా కలిసి వారి యింటికి వెళ్ళేవారు. వాళ్ళు కొట్టబోయే కొబ్బరికాయలో, గుమ్మడి కాయలో "మాచేతి కివ్వండి మేమే దిష్టి తీస్తాం" అని చెప్పి దిష్టి తీసి నట్టుగా చుట్టూ తిప్పి, కాయలు కొట్టి, ఆ కొట్టిన కాయలు యింటికి తెచ్చు కొని స్నేహితులందరూ కలిసి, అవి శుభ్రంగా తినేసేవారు. నాలుగురోజు లయాక దిష్టి తీసినవాళ్ళ యిళ్ళకి వెళ్ళి "మీరు దిష్టి తీసిన కాయలు తినకూడదు అంటారు, చూడండి, మేము తిన్నాము, మాకే ప్రమాదమూ జరగలేదు" అని ప్రత్యేకంగా చెప్పి, యీ మూఢ విశ్వాసాలు పోగొట్టేందుకు ప్రయత్నించేవారు.

పంతులుగారు తమ జీవితాన్ని క్రమశిక్షణతో, ప్రత్యేకమైన ఒరవడిలో తీర్చిదిద్దుకున్నారు. అయితే యిది ఒక్కరోజులో హఠాత్తుగా జరిగినదికాదు. క్రమక్రమంగా ఆయన వ్యక్తిత్వంలో పరిణతి వచ్చినకొద్దీ, తమను తామే ఆత్మపరిశీలన చేసుకుంటూ, జీవితవిధానాన్ని నియమబద్ధం చేసుకున్నారు. చిన్నతనంలో వరంగల్లులోనూ హైద్రాబాదులోనూ వుద్యోగం చేసే రోజుల్లో ప్రతి వేసవిలోనూ ఎర్రుపాలెం వెళ్ళి, ఆ రెండు నెలలూ విశ్రాంతిగా గడిపేవారు. అక్కడ తమ కుటుంబం, తల్లి, అన్నగారు, వదినెగారు, కుమార్తె, నవుకర్లు, పల్లెటూరి వాతావరణంలో సుఖంగా సరదాగా జరిగిపోయేవి రెండునెలలూ. అయితే కొంతకాలం యిట్లా జరిగాక పంతులుగారు బాధపడటం మొదలుపెట్టారు. "ఇదేమిటి ప్రతి సంవత్సరం రెండునెలలు నేను సోమరిపోతులాగా సమయాన్ని గడుపుతున్నాను, వృథా చేస్తున్నాను. సంతోషంగా గడుపుతున్నానుగానీ ప్రయోజనకరమైన పని ఏమీ చేయడం లేదే!" అని ఆత్మవిమర్శన చేసుకుని, అప్పటి నుండి సెలవుల్లో కూడా హైదరాబాదులోనే వుండి సాంఘికసేవా కార్యక్రమాలకే ఆ సమయాన్ని వినియోగించడం మొదలుపెట్టారు.

మతమవుఢ్యం గురించి కానీ కులవిచక్షణ గురించి కానీ పంతులుగారు చేసే హెచ్చరికలు సున్నితంగా వుండేవి.

ఒకసారి ఆయన కుటుంబంతో ఎర్రుపాలెం వెళ్ళారు. గ్రామంలోని స్త్రీలూ పురుషులూ చాలా మంది ఆయనతో మాట్లాడటానికి, చూడటానికి వచ్చి వెళుతూ వున్నారు. మధ్యాహ్న సమయం అయింది. వారి యింట్లో మహార్‌బీ అనే ముస్లిం యువతి పని చేస్తూ వుండేది. ఆరోజు ఆ ముస్లిం యువతే టీ తయారు చేసి అందరికీ యిచ్చింది. పంతులుగారు టీ తాము తీసుకుంటూ, మిగిలినవారిని కూడా టీ తీసుకోమని కోరారు. ఇద్దరు ముగ్గురు ఆడవారు టీ తీసుకోవడానికి నిరాకరించారు. "మాకు వద్దు, వద్దు!" అన్నారు.

పంతులుగారు వూరుకోలేదు.

"ఏమి? మీకు టీ త్రాగడం అలవాటు లేదా?" అని రెట్టించారు.

"అలవాటేననుకోండి, కాని- - - యిప్పుడెందుకు?" అంటూ నసిగారు ఆ స్త్రీలు.

హనుమంతరావుగారు చిరునవ్వులు నవ్వుతూ "ఓహో! నాకు తెలిసింది లెండి! తురకమనిషి తయారు చేసిన టీ త్రాగుతే, మీ ఆచారానికి భంగం అని కదా సందేహిస్తున్నారు" అంటూ పకపకా నవ్వారు.

ఆ ఆడవారికి చాలా చిన్నతనం అనిపించింది. అంత పెద్దవారు, పంతులుగారు, భార్య టీ తీసుకుంటున్నప్పుడు, తాము తీసుకోకపోతే, తమని చాలా సంకుచితమైన మనసులు అనుకుంటారనీ, అయినా యిందులో తప్పేముందనీ, పంతులుగారి పైగల గౌరవం కొద్దీ టీ తాగారు. ఈవిధంగా

మన్నితమైన మందలింపులతో, నచ్చ వెప్పడం ద్వారా సంస్కరణలు జర వడం పంతులుగారి వ్యక్తిత్వంలో ఒక ప్రధాన భాగం.

* * *

స్వామి వివేకానందులు యిట్లా అంటారు.

'If there were only one method to arrive at the Truth, it would be death for every one else who is not similarly constituted...'

సత్య దర్శనానికి ఒకే ఒక మార్గం వున్నదనడం సరికాదు. మహమ్మదీయులు మాదే సరియైన మార్గమనీ, క్రయిస్తవులు తమది సత్యమార్గమనీ, బౌద్ధులు అన్నింటికంటే వారిది నిజపథమనీ అంటే ఎట్లా వుంటుంది?

'Let each person in the world be separate... It is a most glorious dispensation of the Lord that there are so many religions in the world and these would increase every day until every man had a religion unto himself' - అన్నారు.

మనిషి పరిణతికి పరాకాష్ట మతమును గురించి సరియైన అవగాహన పొందడం; పరమాత్మతో తన అనుబంధాన్ని తన అంతరంగికమైన విషయంగా అనుసరించడం.

హనుమంతరావుగారు కొంత వయసు వరకు - దాదాపు 35-40 సం॥ల వరకు సాధారణమైన హిందూ గృహస్థు వలెనే నిత్యజీవిత వ్యవహారాలు నడుపుకున్నారు.

అర్థంపర్థంలేని ఆచారాలు, అసంఖ్యాకమైన దేవతలూ, పూజా పునస్కారాలు పంతులుగారిని ఆలోచింప జేశాయి. ఆయన బ్రహ్మసమాజపు విధానాలవైపు మొగ్గు జూపారు-ఇంట్లో 'రిచ్యుయల్స్' అన్నీ మానిపించారు.. పైపైన చేసే ప్రార్థనలూ వాటికి ప్రాముఖ్యం యివ్వడం తగ్గించారు. అన్నింటికంటె అంతరంగిక నిర్మలత్వము ప్రధానమైనది అనేవారు. మతాతీతము అయిన ఒక వున్నత మానసిక స్థాయిని పంతులుగారు ఏ తాత్త్వికచర్చలూ వాద వివాదాలూ లేకుండానే అందుకో గలిగారు. ఈ విధంగా నేను ముందుగా వుదహరించిన వివేకానందుని పలుకులను ఆయన తమ జీవితంలో ఆదరించి చూపారు.

పందొమ్మిదో శతాబ్దంలో జన్మించిన కొందరు మేరునగధీరులు. మహా పర్వతాల వంటివారు. గంభీరంగా ధృఢంగా నిలబడి, తమ గమ్యాలు అందుకోడానికి కృషిచేశారు. ఇతరులలో కార్యోత్సాహం కలిగించి వున్నతపథాలవైపు నడిపించారు.

తెల్లని ఖద్దరు వస్త్రాలు ధరించి తెల్లని గాంధీ టోపీ పెట్టుకొని ప్రశాంతమైన ముఖవర్చస్సుతో వుండే మాడపాటి హనుమంతరావు పంతులుగారిని, మా తాతగారిని - శీతకిరణునితో పోల్చడం అసమంజసం కాదనుకుంటాను. చల్లని హృదయంతో లెక్కలేనన్ని జీవితాలలో వెన్నెల పండించిన మహానుభావు డాయన.

# ఆనంది

## అన్నపూర్ణా రెడ్డి

ఆనంది అత్తమామలు వైద్యం నిమిత్తం కేరళ వెళ్లారు. భర్త తరపు బంధువు మన్‌మోహన్ విషయంలో భర్త ప్రభాకరం, తను చెప్పేదేమిటో వినకుండా, నిష్కారణంగా అనుమానపడి, యిష్టమొచ్చినచోటికి వెళ్ళిపొమ్మంటాడు. అవమానమూ రోషమూతో చంటిపిల్ల ప్రదీప్తితో స్నేహితురాలు వైదేహివద్దకు వచ్చి ఆమె ఆశ్రయం పొందుతుంది. . .ఇక చదవండి.

కళ ముఖంలో ఇంకా చిన్నతనపు ఛాయలు వదల్లేదు.

"ఇంట్లో వాళ్లు లేకపోతేనేం ? నేను లేనూ ? .... మీరు ఎన్నాళ్లున్నా నాకు బాధలేదు. స్నేహితుడు, అందులోనూ మౌళి కష్టాలలో వుండి, వెతుక్కుంటూ వస్తే, కాదనేంతటి మూర్ఖుణ్ణికాను. తరువాత ఆలోచించుకోవచ్చు, ముందు వెళ్ళండి. ముఖం కడుక్కొని స్నానం చేయండి, ఈలోగా కాఫీకి ఏర్పాట్లు చేస్తాను" అన్నాడు ప్రభాకర్.

చిన్నగా నవ్వుతూ "బ్రహ్మచారివి, నీ ఏర్పాట్లు బాగానే వుంటాయి కానీ, కిచెన్ ఎక్కడుందో చూపించు. కళ ఎలాగో తంటాలు పడుతుంది. .... కళా..... వెళ్లు" అన్నాడు మౌళి.

"ఆ మాత్రం చొరవుంటే ఫరవా లేదు, రండి...." అంటూ కళను వంటి ఇంటిలోకి తీసుకెళ్ళాడు.

రెండు చెంబుల నీళ్ళు దిమ్మరించుకొని వంటింటి అజమాయిషీ తీసుకుంది కళ.

వేడివేడి ఉప్మాతిని, ఘుమఘుమలాడే కాఫీ త్రాగి స్నేహితు లిద్దరూ కులాసాగా నవ్వుతూ కబుర్లు చెప్పుకుంటూ, సిగరెట్టు మీద సిగరెట్టు ఊదేయసాగారు.

చిందర వందరగా వున్న గదులన్నీ దుమ్ము దులిపి శుభ్రంగా ఊడ్చి కుర్చీలు బల్లలు అన్నీ పొందికగా సర్దేసింది కళ. ఆమె వంటపని చూసుకొంటూంటే మాసిన గడ్డాన్ని నున్నగా తరిగి, మీసం ట్రిమ్ చేసి, బ్రిల్ క్రిమ్ పట్టించి, తలనున్నగా దువ్వి, ఇస్త్రీమడత లు తొడిగి, నీట్‌గా తయారయ్యాడు ప్రభాకర్.

కాఫీ భోజనాల కోసం హోటల్‌కు వెళ్ళాలంటే బద్ధకించి ఒక్కోరోజు పస్తులతో గడిపిన ప్రభాకర్‌కు, భోజనంకోసం తడుములాట తగ్గిపోవ

డంతో నిశ్చింత అనిపించింది. కళ బుద్ధిగా, వంచిన తల ఎత్తకుండా ఇంట్లో వున్న అలికిడి తెలియనంతగా ఇంట్లో మెసలుకోసాగింది.

సెలవు అయిపోవడంతో మూడో రోజు ఆఫీసుకు వెళ్ళిపోయాడు ప్రభాకర్. కళ, వేళకు వంటచేసి అందించలేకపోవడంతో, ఆఫీస్ అవర్స్ కనుక్కొని మధ్యాహ్న భోజనం కేరీయర్‌లో సర్ది, తీసికెళ్ళి యిచ్చి మరీ వచ్చేవాడు మౌళి.

ఐదో రోజు ప్రభు ఇంటికొచ్చే సరికి మౌళి, "క్రొత్తగూడెంలో ఉద్యోగావకాశాలున్నాయట. ఓ స్నేహితుడు వుత్తరం వ్రాశాడు" సంతోషంగా చెప్పుకుపోయాడు మౌళి.

"మరైతే వెళ్ళిరా! ఆలస్యమైతే ఆ అవకాశాన్ని మరొకరు తన్నుకుపోగలరు" తొందరించాడు ప్రభు.

సంతోషం కాస్తా చప్పున చల్లారిపోయింది. తల గోక్కుంటూ మిన్నకుండిపోయాడు మౌళి.

ఏదో చెప్పడానికి సందేహిస్తున్నాడని పసిగట్టి "ఏమిట్రా మౌళీ ఏమిటి సందేహం?" అన్నాడు ప్రభు.

"కాదురా.... సిస్టర్‌ను.. ఏమి చేయాలా అని.... వెంట తీసుకెళ్దామంటే ముక్కూ ముఖం తెలియని చోటు. పోనీ ఇక్కడే వుంచి వెళ్దామంటే, ఇంట్లో నీకూ ఎవరూ లేరు." విచారంగా బదులిచ్చాడు మౌళి.

"ఎవరూ లేకపోతే ఇంట్లో నేను లేనూ? ఆఫ్‌కోర్స్, నీకు, ఆ అమ్మాయికీ అభ్యంతరం లేకపోతేనే!.... ఇక్కడే వుంచేసి వెళ్ళడం మంచిదంటాను. నన్నడిగితే. పొరుగూరిలో ఎక్కడని వెంటపెట్టుకు తిప్పగలవు? వారం పదిరోజుల్లో ఏ సంగతీ తేలిపోతుంది కదా? అవసర సమయాల్లో ఆ మాత్రం ఒకరికొకరు సహాయం చేసుకోకపోతే ఈ స్నేహాలెందుకు?" కళ్ళెగరేశాడు ప్రభాకర్.

"కళా!.... కళా...." పిల్చాడు మౌళి. తడిచేయి కొంగుకు తుడుచుకొంటూ వచ్చి మౌనంగా తల వాల్చుకు నుంచుంది కళ.

"చూడు, కళా...." అంటూ పరిస్థితి కళకు వివరించి.... "వుంటావు కదూ?" కళ ముఖంలోకి చూస్తూ అన్నాడు మౌళి.

తలపైకెత్తి మౌళి వంక చూచి కళ్ళు వాల్చేసుకుంది.

ఆ అమ్మాయి భయం పసిగట్టినట్టు "చూడండి, మీ కెలాటి సందేహం వద్దు. కావాలంటే మీకు తోడుగా మా ఫ్రెండువాళ్ళ బామ్మగారిని వుంచుతాను" అన్నాడు ప్రభు.

"అబ్బే ఎందుకురా?"

"అబ్బే.. అవసరం లేదండీ"

ఇంచుమించు మౌళి, కళ ఏక కాలంలో అన్నారు.

'సరే.. అవుతే ఇంకేం.... నీవు నిశ్చింతగా వెళ్ళిరా,' అన్నాడు, సమస్య తేలిపోయినట్టు ప్రభు.

మీనాక్షిని వెంట బెట్టుకొని మెయిన్ బజారులో షాపింగ్ చూచు

కొని, కబుర్లు చెప్పుకొంటూ మన్ మోహన్ కృష్ణ, ఆ ప్రక్క సందులో వడి వడిగా వెళ్తున్న స్త్రీ మూర్తిని చూచి ఆగిపోయాడు.

సందేహం లేదు ఆమె.. ఆమె.. అనంది.... ప్రక్కన ప్రదీప్తి....

''మీనూ ....నీవు ఇంటికెళ్లు....ఓ స్నేహితుణ్ణి కలుసుకొనివచ్చేస్తాను.... కమ్మగా వండాలి వంట'' - సమ్మోహనంగా నవ్వి మీనాక్షిని వదల్చుకొని అనంది వెళ్ళిన సందువెంట వడి వడిగా అడుగులేశాడు మనూ.

ఉవ్వెత్తున లేచిన కోపాన్ని అణుచుకొంటూ "పా పా" గట్టిగా పిల్చింది.

"అమ్మా....దా ....అంకుల్....". అంటూ అతడి చేతుల్లోంచి జారి తల్లి దగ్గరకు వచ్చి చీరకుచ్చెళ్లు పట్టుకుంది.

మరుదినం తడిచేయి కొంగుకు తుడుచుకొంటూ ప్రదీప్తి కోసం వరండాలోకి వచ్చిన అనంది మనూ చేతుల్లో ప్రదీప్తిని చూచి సర్పదష్టలాగ అదిరిపడింది.

"అరె.... అనందీ .... ఇక్కడకి ఎప్పుడొచ్చావు...." బొరవగా ప్రశ్నిస్తూనే హాల్లోకి వచ్చి నుంచున్నాడు మన్ మోహన్.

''కూచో అంకుల్.... ఊ కూచో మంటుంటే'' అని ప్రదీప్తి మర్యాదం చేయడంతో "అతిథిని కూర్చోమని చెప్పేసభ్యతకూడా లోపిస్తూంది మీ అమ్మలో.... ఆల్ రైట్ మైడియర్ బేబీ!....''అంటూ అనందివైపు చూస్తూ కుర్చీలో కూర్చుని బేబీ బుగ్గలు గట్టిగా ముద్దిడుకున్నాడు.

అనంది మనసు కల్లోలితమైంది. కాపురంలో కలతలు రేగి విచ్ఛిన్నమవడానికి మూలకారకుడైన వ్యక్తి 'రామేశ్వరం వెళ్ళినా....' అన్నట్టు, ఎక్కడో వానాకాలంగా తలదాచుకొంటున్న తనకు తారసపడ్డం సుతేమిరా ఇష్టం లేదు.

అతడు పలుకరిస్తున్నా, విననట్టు లోపలికి వెళ్ళిపోయింది.

కాసేపు కూర్చొని ''అమ్మ మాట్లాడ్డం లేదు.... వస్తాను, పా పా, టా టా....'' అంటూ వెళ్ళిపోయాడు.

ఇంకోరోజు ఇంచుమించు అదే సమయంలో వచ్చి, ''అనందీ....మనుషులు ఎంత ఎడ్యుకేటెడ్ అయినా ఒక్కోసారి ఫూల్స్‌లాగ యాక్ట్ చేస్తుంటారు. ప్రభు నిజంగా పిచ్చివాడే!. .. శిరోధార్యమైన మణిని చేతులారా విసిరేసుకున్నాడంటే ప్స్!'' అన్నాడు.

అనంది మనసులో అక్కసు ఉవ్వెత్తుగా పొంగుతోంది. గోముఖ వ్యాఘ్రంగా అవుపించే అనాగరికుణ్ణి చూస్తుంటే సత్కారం చేయాలన్నంత ఆవేశంగా వుంది.

"మీబోటి శ్రేయోభిలాషులున్నంత వరకూ కొన్ని కాపురాలిలాగే వుంటాయి లెండి'' అంది కొరకొరా చూస్తూ. గట్టిగా నవ్వేసి అంతలోనే గంభీరంగా ముఖం పెట్టి ''మై గుడ్‌నెస్....నీ స్థితికి కారణం నేనా....వ్వాట్ ఎపిటీ....మై మై నమ్మలేకుండా వున్నాను .... ప్రభు నిజంగా ఇంత ఫూలా ! అసలు నీవు మొన్న కోపంగా వుంటే ఎందుకో అనుకున్నాను....'' (ఇంకా వుంది

